Brought To You By www.greenmangos.net

# బాలల బొమ్మల

# అక్బర్ - బీర్బల్ వినోద కథలు

## దేవుని మహిమ

అక్బర్ పాదుషా వారి నిండు కొలువు కూటంలో ఒకనాడు పండిత గోష్ఠి సాగుతోంది. ఆధ్యాత్మిక ధార్మిక నైతిక అంశాలన్నిట్నీ ప్రముఖులు చర్చిస్తున్నారు. ఆ సభలో అక్బర్‌కు ఎంతో ఇష్టుడయిన బీర్బల్, ఆయనకు చేరువలోనే ఒక సమున్నతాసనంపై ఆశీనుడై చర్చల సారాంశాన్ని సమీక్షిస్తు న్నాడు. ఉన్నట్లుండి దేవుని మహిమకు సంబంధించిన ఒక ధర్మ సందేహం అక్బర్‌కు కలిగింది. మేధావులు, ముల్లాలు, యోగులు ఇందరొకచోట చేరి చర్చిస్తున్న ఆ తరుణాన తప్పక తన సందేహ నివృత్తి కలుగు తుందనిపించిం దాయనకు.

అందువల్లనే తన సందేహాన్ని సభాముఖంగా బయటకు వెలువరించాడు.

"లోకంలోని జీవుల స్థితిగతులను బట్టి పరికించి చూస్తే, దేవునికి పక్షపాతం ఉన్నట్లుగా తోస్తోంది. ఎందరో ధనవంతుల్లేరు. అట్లే ఎందరో అవయవాలన్నీ సరిగ్గా ఉన్నవాళ్ళూ లేరు. నిజంగా ఆయన మహిమాన్వితు డైతే, ఈ అసమతుల్యత ఏల?" అన్నాడు అక్బర్.

ఎవరెన్ని విధాలుగా జవాబు చెప్పినా, అది ఆయన్ను సంతృప్తి పరచలేక పోయింది.

విచిత్రసంభాషణా చతురుడు, యుక్తిపూర్వక సమాధాన నిపుణుడూ అయిన బీర్బల్ వైపు చూచి " ఎందరు ఎన్ని విధాలుగా సమాధానాలు

Brought To You By www.greenmangos.net

చెప్పినా ఏదో ఇంకా అసలైనది రాబట్టలేక పోయాననే అనుకుంటున్నాను. దేవుని మహిమ ఎట్టిదో నువ్వు వివరించు-వినాలని ఉంది" అని కోరాడు అక్బర్.

అందుకు జవాబుగా బీర్బల్ ఇలా అన్నాడు....

"మహారాజా! తమ ఏలుబడిలో రాజ్యమంతటా ప్రజలు సుఖ శాంతులతో ఉన్నారని చరిత్రకారులు అంటున్నారు. అయితే తమ రాజ్యంలో నిజంగానే అంతా సవ్యంగా ఉన్నదంటారా? మీ ఆత్మే సాక్షి. అయితే అత్యధి కులు ఆనందంగా ఉన్నప్పుడు ఏ కొద్దిమందికో సౌఖ్యలోపం కలిగినా, అది బైటకు రాదు. దేవుని రాజ్యంలో కూడా అంతే! ఆయన కరుణ అందరి మీదా సమానంగానే వర్షిస్తుంది. అయితే తన సేవలో ఉన్నవారికి ఆ ప్రభువు అడగకుండానే అన్నీ సమకూరుస్తాడు. తనను నిత్యం గుర్తుంచు కునేవారికి భగవంతుడేలోటూ రానివ్వడు. ఏదో కష్టకాలంలో మాత్రమే తలచేవారికి, కేవలం ఆయా కష్టాలను మాత్రమే తప్పిస్తాడా దేవుడు.

ఉదాహరణకు... మా రాజుగారైన మీరే ఉన్నారు. నిత్యం మీ సన్నిధిలో ఉండే మావంటి వారి కష్టసుఖాలు మీరే స్వయంగా విచారించి, మా శక్తి సామర్థ్యాల్ని బట్టి సమస్త వసతులను సమకూరుస్తున్నారు కదా! అలాగే తమను సేవించనివారికి జీతం ముట్టనట్లు దేవుని సేవించని వారికి ఎటువంటి యోగం కలగడంలేదు. ఇదే దేవుని మహిమ. నా స్వానుభవంలో ప్రభుసేవలో తరించడమే ఉత్తమం అని తెలుసుకున్నాను" అంటూ లౌక్యంగా అక్బరుకు అన్యాపదేశంగా భగవంతునితో పోలిక తెచ్చి, అందరికంటే మిన్నగా సమాధానం చెప్పిన ఘనతను పొందాడు బీర్బల్. ఈ సమాధానానికి మెచ్చిన అక్బర్ బీర్బల్‌ని సత్కరించాడని వేరే చెప్పనవసరం లేదుకదా !



# ఈ లోకంలో బాధలుండని దెవరికి ?

వీరబలుడు తనతో ఉన్న సమయంలో, అక్బర్ చాలా ఉత్సాహంగా వుండేవాడు. ఒకరోజు ఇట్లే పండితసభామధ్యమున చుక్కల్లో చంద్రుడిలా ప్రకాశిస్తున్న బీర్బల్‌ని చూసి " ఇప్పుడొక ధర్మ సందేహాన్ని పండితులందరి ముందూ పెడుతున్నాను. ఐతే దానికి వచ్చే సమాధానాలన్నీ విని బీర్బల్ ఎవరి అభిప్రాయం సరైనదో నిర్ణయించాల్సి ఉంటుంది. ఆధర్మ సందేహానికి తగ్గ సమాధానం రాకుంటే తానే ఆ ధర్మ సందేహం తీర్చవలసి వుంటుంది "అని చిత్రంగా అన్నాడు.

పాదుషా వారి సందేహం ఎలాంటిదో అని పండితులంతా ఊపిరి బిగబట్టి ఆయన ప్రశ్నకోసం ఎదురుచూడ సాగారు. గొంతు సవరించుకుని అక్బర్ ఇలా అన్నాడు. " ఈ లోకంలో బాధలుండని దెవరికి ?" అని....

" ఓస్ ! ఇంతే కదా ! బాధల్లేని దెవరికి ? అందరికీ ఏదో ఓ బాధ ఉండనే ఉంటుంది. కొందరికి దేహబాధ, కొందరికి దారిద్ర్య బాధ, కొందరికి భార్యవల్ల బాధ, కొందరికి సంతానంవల్ల బాధ... ఇలా తరచి చూస్తే లోకబాధలు అంటని దెవరికి ? ఊరకే ప్రభువుల వారేదో పరీక్షించాలని అలా అన్నారు గాని, బాధలు లేని ప్రాణి ఈ ప్రపంచంలో లేదుగాక లేదు..." అంటూ అందరూ తలోక బాధను వివరించారు.

" ఏం బీర్బల్ ? నువ్వేం మాట్లాడవు ? ఈ పండితులందరి అభిప్రాయాలూ సరైనవేనా ? అంగీకరించమంటావా ?" అన్నాడు అక్బర్.

" జంహాపనా ! మీ ప్రశ్నని సరిగ్గా అర్థం చేసుకుంటే ఈ లోకంలోని బాధలు ఉండని వారు ఇద్దరే ఇద్దరు ఉన్నారు " అన్నాడు బీర్బల్.

Brought To You By www.greenmangos.net





**సహజ బాధలు లేనివారి గురించి చెపుతున్న బీర్బల్**

పండితులంతా ఆశ్చర్యంగా నోరు తెరిచి " ఈ బీర్బల్ మహా లౌక్యుడు. ప్రభువుల వారికి ముడిపెట్టి ఏదో ఒక జవాబును చెప్పి వారిని ఖుషీ చేస్తాడు. లేకుంటే ఏమిటీమాట? ఈ లోకంలో ఇద్దరికే బాధలుండ వట. తనకీ – ప్రభువుకీ కాబోలు " అంటూ గుసగుసలాడుకో సాగారు.

"భేష్ బీర్బల్ ! నా తాత్విక చింతనకు సరిగ్గా సరిపోగల సమాధానం చెప్పావు. ఆ ఇద్దరూ ఎవరెవరో ఈ సభలోని వారికి ఎరుక పరుచు" అని అనుజ్ఞ ఇచ్చాడు అక్బర్.

" లోకచింతన లేని శిశువు ఒకరు, లోకబంధనాల బెడద వేదాంతి మరొకరు. వీరికి మాత్రమే ఎటువంటి లోకసహజ బాధలూ ఉండవు. అసలు లోకమనేదే తెలియక ద్వంద్వాలెరుగక (ఉదా: కష్టసుఖాలు, పుణ్యాపాపాలు, సత్యాసత్యాలు మొ॥) నిత్యానందంలో ఓలలాడేది శిశువు.



ఇక సమాధి స్థితిలో ఉండి సుఖదుఃఖాల ప్రమేయం లేని నిత్యానంద యోగివర్యులకు బాధ లేముంటాయ్? కనుకనే వీరిద్దరినీ పేర్కొనడం జరిగింది " అంటూ వివరించాడు బీర్బల్.

" నిజమే కదా! లౌకిక బంధనాలే లేని వారికి బాధలు ఎలా వుంటాయ్? బీర్బల్ సమాధానం చాలా ప్రశస్తంగా ఉంది " అని ప్రశంసించి సత్కరించాడు అక్బర్.

## చిలుక పింపకం

అక్బర్ పాదుషా ఒకరోజు నిండు దర్బారులో ఉండగా ఒక చిలుకల విక్రేత సభలో ప్రవేశించాడు. రకరకాల చిలుకల సుమధుర రవాలతో దర్బారంతా కళకళలాడింది.

ఆ చిలుకలమ్మేవాడు " ప్రభూ! నేను మేలుజాతి చిలుకలను సేకరించి, వాటికి మంచి తర్ఫీదిచ్చి రకరకాల పలుకులు పలికేలా చేశాను. ఒకటా! రెండా? దాదాపు మూడు పదుల చిలుకల వరకే నావద్ద ఉన్నాయి. అన్నిటినీ సరిసమాన స్థాయిలోనే నేర్పించాను. తమరే స్వయంగా పరీక్షించుకుని చూడవచ్చు. నచ్చిన దానిని తమకు నజరానాగా సమర్పించు కోవాలని నా ఉబలాటం " అన్నాడా విక్రేత.

" ఓహో! అంత గొప్ప నేర్పుగల చిలుకలను తెచ్చిన నీ శ్రమ ప్రభువుల వారు ఊరకే ఉంచుకోరు భాయ్! వారి హృదయానికి నచ్చిన చిలుక అయితే, నీకు భారీగా బహుమానం ఉంటుంది " అని ప్రభువు తరఫున బీర్బల్ భరోసా ఇచ్చాడు–అక్బర్ సంజ్ఞ చేసిన దాన్ని బట్టి గ్రహించి.

ఆ పక్షి విక్రేత చెప్పినదాంట్లో ఇంచుకయినా అసత్యమన్నది లేదు. అన్ని చిలుకలూ మేలు జాతివే ! అవి అనేక రకాలుగా మాట్లాడి సభవార్ని

Brought To You By www.greenmangos.net



అలరించాయి. అక్బర్ కూడా అన్నిట్నీ పరీక్షించి, చివరకొక చిలుకను గౌరవ పురస్సరంగా మాటామంతీ ఉన్నదాన్ని ఎంచి పుచ్చుకుని, ఆ విక్రేతకు ఊహించిన దానికన్నా అధికమైన బహుమానం ఇచ్చి పంపాడు.

తరువాత దివాణంలోని ఇద్దరు భటుల్ని పిల్చి "ఎంతో మేలు జాతి చిలుక ఇది. దీన్ని జాగ్రత్తగా చూసుకోవల్సిన పని మీకు అప్పగిస్తు న్నాను. దానికి సరిపోయే ఆహార విహారాలు చూసే బాధ్యత మీదే. మనవద్ద ఇదివరకే ఉన్న బంగారు పంజరాల్లో ఒకదాన్ని ఖజానా అధికారి నుంచి పొంది, అందులోకి దీన్ని జాగ్రత్తగా ప్రవేశపెట్టండి. ఏమాత్రం ఆదమరపుగా ఉన్నా లేదా దీనికి సంబంధించిన అనారోగ్య వార్త నాకు వినిపించినా మీకు మరణశిక్ష ఖాయం! మీకే కాదు! ఈ సభ లోని వారందరికీ ఇదే శాసనం. ఈ చిలుకకు సంబంధించి ఎటువంటి దుర్వార్తనైనా నాకు వినిపించిన వారి తల తెగుతుంది" అని ఆజ్ఞ జారీ చేశాడు అక్బర్‌పాదుషా.

వారి ఫర్మానా అందరితో పాటు బీర్బల్ కూడా విన్నాడు.

భటులు ఆ చిలుకను అపురూపంగా తీసుకెళ్ళి, ప్రభువు చెప్పినట్లే బంగారు పంజరంలో ఉంచి బహు జాగ్రత్తగా చూసుకో సాగారు. దానికి సమస్త రాజభోగాలు కల్పించబడ్డాయి. కానీ, ఆ భటుల దురదృష్టం కొద్దీ, ఆ అడవిజాతి చిలుకకి రాజోచిత ఉపచారాలు వికటించి జబ్బుచేశాయి.

ఆ చిలుకకు అజీర్ణవ్యాధి అంకురించింది. రాజవైద్యులను బ్రతిమాలి, ఆ చిలుక ప్రాణాలకు అపాయం రాకుండా రక్షించమని–తమ ప్రాణాలరచేత పట్టుకుని వేడేకున్నారా భటులు. దానికేదైనా జరగ రానిది జరిగితే, తమ తలలు తెగుతాయన్న భయమావరించింది వారిని.

దానికి సంబంధించి దుర్వార్త ఎవరివల్ల విన్నా, అదేశిక్ష కనుక రాజవైద్యులు కూడా మిక్కిలి శ్రద్ధతో దానికి వైద్యం చేయసాగారు. కాని



విధి బలీయం కదా ! చిలుక ప్రాణాం అల్పం. దానికి పెట్టిన పదార్థాలు బలం. వ్యాధి ముదిరింది. చివరికో రోజున తలక్రిందులుగాను, కాళ్ళు పైకిపెట్టి గ్రుడ్లు తేలవేసి అది ' హరీ ' మంది. ఇక భటులకి పైప్రాణాలు పైనే పోయాయి.

ఈవార్త అక్బర్ పాదుషాకి వినిపించేవారెవరు? ఎవరికైనా ప్రాణాలంటే తీపేకదా! సంరక్షణకు నియమించినందున తామే ఏదో నాటికి చెప్పక తప్పదు. అప్పుడా ప్రభువు ఆచిలుకను చూపమంటే ?! చిలుకను ఎన్నాళ్ళు శరీరం చెడకుండా ఉంచడం? అన్నీ సమస్యలే !

అప్పుడా సమయంలో వారికి బీర్బల్ మంత్రిసత్తముడు గుర్తుకొచ్చాడు. బహు విషయ పరిజ్ఞాని, నేర్పరి, పైగా ప్రభువుతో చనువున్న వాడు.... ఆయన తప్ప తమనీ ప్రాణ గండాన్నుంచి గట్టెక్కించేవారు లేరని నిశ్చయించుకుని, ఆ భటులిద్దరూ బీర్బల్ సన్నిధికి వెళ్ళి, ఆయన పాదాలపై వ్రాలారు.

'అభయ'మిస్తే కాని లేవమంటూ కాళ్ళు వదలక పట్టుక్కూర్చు న్నారు. జరగరానిదేదో జరిగి ఉంటుందని చిటికెలో గ్రహించేసిన సూక్ష్మబుద్ధి బీర్బల్ "మీ ప్రాణాలకు నా ప్రాణాలు అడ్డు లేవండి ముందు" అన్నాక గాని వాళ్ళు కాళ్ళొదల్లేదు.

బీర్బల్ వారిని ఊరడించి తానే స్వయంగా అక్బర్‌తో ఇలా ప్రారంభించాడు...

"ప్రభూ! తమరు కొన్న చిలుక చాలా గొప్పది. దానికిగల మంచి గుణాలు వర్ణించ మనమెంత ? అదృష్టం చాలక అది చిలుక జాతిలో పుట్టిందిగాని, అదే గనుక మానవ జాతిలో పుట్టివుంటే తప్పక యోగిగా మారి ఉండేది. అందుకు సందేహం లేదు".

Brought To You By www.greenmangos.net





తెలివితో అక్బర్‌ను సమాధానపరుస్తున్న బీర్బల్

బీర్బల్ ఇలా తుదీ - మొదలూ లేకుండా, ఉన్నట్టుండి ఈ అప్రస్తుత ప్రసంగం ఎందుకు ప్రారంభించాడో అతడికి అంతుబట్టలేదు.

" ఏమిటయ్యా బీర్బల్ ! ఇంత హఠాత్తుగా దాన్ని గురించి ప్రశంస దేనికీ? " అని ఆశ్చర్యపోయాడు అక్బర్. అదేం పట్టించుకోకుండా బీర్బల్ తనదైన ధోరణిలో జవాబు చెప్పసాగాడు.

" అసలు అది గతజన్మలో యోగులతో మసలినదేమో అని సందేహం. దానికి సమాధి ఇష్టంగా ఉన్నట్లు తోస్తోంది. ఇంకో లోక వ్యవహారం లేదు. ఉదయం నుంచీ అది కాళ్ళు పైకి పెట్టి, తల వాల్చి, గ్రుడ్లు తేలవేసి, రెక్కలు విడదీసి సమాధిలో ఉంది. అది కదలదు మెదలదు పలకదు సేవకులు తెచ్చే పదార్థాలను రుచికూడా చూడటం లేదంటే నమ్మండి. మహర్షులు బహుశా ఇలాగే ఉంటారేమో!" అంటూ



డొంకతిరుగుడుగా దాని మరణ వార్తను అక్బర్ చెవిన వేశాడు. బీర్బల్ చివరిమాట అక్బర్‌లో ఆసక్తిని రేపింది. మహర్షులు ఎలా ఉంటారో చూడటం అదృష్టమేలే! పద! పద!' అంటూ అక్బర్ తనకు తానై చిలుకను చూడ్డానికి కదిలాడు.

తీరా బీర్బల్‌తో కలసి వచ్చి చూసేసరికి ఏముందీ చిలుక మరణం చూడవలసి వచ్చింది.

"చిలుక ప్రాణం ఎగిరిపోయినట్లుంది బీర్బలా ! సమాధీ- మహర్షీ అంటూ ఏదేదో చెప్పావు. చిలుక పోయిందని ఒక్కముక్క చెప్తే చాలదా?" అని చిరాకు పడ్డాడు అక్బర్.

" చెప్పేవాడినే ! కానీ, తమరు చిలుక చచ్చిందని చెప్పినా కూడా ఆ వార్త తెచ్చిన వారిని మరణదండనతో మాత్రమే సత్కరిస్తానని నిష్కర్షగా చెప్పారట ! భటవర్గం తమ ఆగ్రహానికి గురికావలసి వస్తోందని భయభ్రాంతమై నాతో మొరపెట్టుకున్నారు. తమతో నాకున్న మైత్రివల్ల నా ప్రాణం పోయినా తృణప్రాయమన్నట్లుగా ఎంచి నాకుతోచిన రీతిలో చెప్పాను ". అనగానే, బీర్బల్ యుక్తిని మెచ్చుకుని ' శెహభాష్ మిత్రమా! చావువార్త చల్లగా చెప్పమన్నారన్న ' హైందవ సామెతను నువ్వు నిజం చేశావు. దీనివల్ల ఎవర్నీ నొప్పించని మిమ్ములను అభినందిస్తున్నాను' అని మెచ్చుకున్నాడు అక్బర్.

## ప్రశ్నోత్తరాలు

ఓ రోజున అక్బర్ ఆస్థానంలో కవులందరూ, తలా ఒక కారణం వల్ల సభకు రాలేకపోయారు. దర్బారు జరిపేటప్పుడు కవులతో సంభాషణ, మేధావుల పలుకులు వినుట, తెలియనివి అడిగి తెల్సుకుని లోకరీతులు గ్రహించుట ప్రభువులు సాధారణంగా చేసే పనే. అక్బర్ కూడా ఆ

Brought To You By www.greenmangos.net

రీతిగానే వెలిగేవాడు. కాని, పండితుల హాజరు లేకపోవడం, ముషాయిరాలు జరగక, నాట్యకత్తెలు ఆడి-ఆడి అలసిపోవడం వల్ల ఏమీ తోచలేదు అక్బరకి. బీర్బల్ వంటి గొప్ప చతురమతి నిత్యం తనవెంట ఉండటం వల్ల, అతడికి ఇటువంటి సందర్భాల్లో ఎట్లాంటి లోటు తెలిసేది కాదు.

అందరూ గైర్హాజరైన ఆ తరుణాన, అక్బర్ పైకి వినోదరిత్యానే కన్పించినట్లు ప్రశ్నలడిగినా, తన అద్భుత మేధాశక్తితో బీర్బల్ నిగూఢ సమాధానాలు ఇచ్చాడు. వారి సంభాషణ ఇలా సాగింది.....

" ఇచ్చినకొద్దీ తరగని ద్రవ్యం ఉందా? ఉంటే ఏది?"

లోకంలో సాధారణంగా ఏదైనా ఇస్తున్నకొద్దీ, నిల్వలోంచి తరిగిపోతుండడం సహజం. కానీ విద్యాధనం ఉందే అది ఇచ్చేకొద్దీ నూత్న అర్థాలు స్ఫురింపజేస్తూ పెరుగుతూంటుంది. ఏ ఇతర ద్రవ్యానికీ ఇటువంటి అసాధారణ గుణం లేదు".

" గడ్డిపరక కంటే తేలికైనది ఏది?"

" దీనికి రెండు సమాధానాలున్నాయి. తల్లి దండ్రీలేని సుతుడు అందరి దృష్టిలో చాలా తేలిక. ఇక గుణగణాల రీత్యా చూస్తే ఇతరుల్ని యాచించే గుణం.

"లోకంలో అతి సున్నితమైనది ఏది?"

"మనిషి శీలం"

"వాయువేగాన్ని మించిన దేది?"

"మనోవేగం. ఈక్షణాన ఇక్కడే ఉన్నట్టుంటుంది అంతలోనే సప్త సముద్రాల అవతల ఏం జరుగుతోందో అన్నట్లుగా అక్కడికి మనస్సు ఊహ సాగిపోతుంది.



"నిద్రపోతూ కన్ను ముయ్యనిది?"

"చేప"

"నీడలా నిత్యం మనతో కూడాఉండేది?"

"మరణం"

"శ్రమవల్ల ఏ సంపాదనకు వన్నె - వాసి తరగవు?"

"కీర్తి ప్రతిష్టలు"

"ఏది మనోవేదన ఎక్కువగా కలిగించగలదు?"

"రహస్యంగా చేసే పాప కర్మలు"

అష్టదిక్కులా సంచరించిన వాళ్ళు సైతం చెప్పలేని, ఈ అష్టవిధ ప్రశ్నలకూ అనుభవ పూర్వక సమాధానాలు చెప్పిన బీర్బల్‌ని ఘనంగా సత్కరించాడు అక్బర్.

## తాగుబోతు లెక్క

అక్బర్ చక్రవర్తికి ప్రతిరోజూ సాయంకాలం ఏనుగుపైన షికారుకెళ్ళడం పరిపాటి. ఒకరోజున బీర్బల్ సలహామేరకు నడక ప్రారంభించాడు అక్బర్. అయితే ప్రభువుకు ఏక్షణంలోనైనా (ఎన్నడూ ఎక్కువదూరం నడవని కారణాన) మార్గాయాసం కలిగితే తక్షణం ఏనుగును అధిరోహించగలరని ఆయనవెంట సుశిక్షితుడైన మావటి ఏనుగుతో కూడా నడిచేవాడు. .

ఇక ప్రభువుల వారికి స్వయంగా తమ విన్నపాలు విన్నవించు కునే అవకాశం ఆసమయంలో కలిగించడానికి అక్బర్ నిశ్చయించు కున్నందున అది ప్రజలకు మహదవకావశంగా తోచింది.

Brought To You By www.greenmangos.net



అయితే, చక్రవర్తి పాదచారులై నడుస్తున్నందున, శత్రువు లెవరైనా కీడు తలపెట్ట వచ్చునన్న ఉద్దేశ్యంతో ఆయుధాలు ధరించి ఉన్న కొందరు భటులు, మార్గానికి ఇరువైపులా ఒక కోటగోడలా అనుసరించే వారు.

ఇలా కొన్నాళ్ళు జరిగాక, ఒకరోజు పాదుషా షికారుకు వెళ్తున్నవేళ, పీకల్దాకా తాగిన ఒకడు అక్బర్‌కు ఎదురెళ్ళి "ఏమయ్యోవ్! నిన్నెప్పుడూ చూసినట్టు లేదే! ఈ నగరానికి కొత్తవాడివన్నమాట! నెత్తిన తలపాగా, దానిమీదో తురాయి, అంగరఖా కూడా కొత్తదే! విదేశీ వ్యాపారివా ఏం?" అని పరామర్శించి అక్బర్‌ని ఎగాదిగా చూడసాగాడు. భటులు ఒక్క క్షణంలో ఆ వ్యక్తిని చుట్టుముట్టి బంధించబోయారు. ఆవ్యక్తి ఘాటుగా తాగేసివున్నాడని అక్బర్‌కి అర్థమైపోయినందున 'త్రాగుబోతుల మాట గణించదగినది కాద'నే ఇంగిత జ్ఞానం ఉన్నందున అక్బర్ తన



అక్బర్‌ని ప్రశ్నిస్తున్న తాగుబోతు



భటులను వారించాడు. మరికొంత సేపు అతడ్ని వాగనివ్వడానికీ–ఆ విధంగా అతడందించే ఉచిత వినోదాన్ని ఆస్వాదించడానికి నిర్ణయించు కున్నాడు అక్బర్.

అటూఇటూ చూసిన ఆవ్యక్తి " చూడబోతే ఆ ఏనుగు నీది లాగానే ఉందే ! అమ్మకానికి తెచ్చావా ఏం ? శనివారపు సంతలో అయితే మంచి ధర పలుకుతుంది. ఇదేదో రాజవీధి అనీ ఇక్కడ ఎవరో ఒకరు కొనకపోతారా అనీ ఆశిస్తున్నావు కాబోలు ! అసలు నారాత బాగుంటేనా? సర్లే ! ఇంతకీ ఏనుగు ఎంతకు అమ్ముతావ్ అదిచెప్పు ముందు "అంటూ నిలదీశాడు అక్బర్‌ని.

శృతిమించి వాడి ధోరణి రాగన పడుతోందని గ్రహించుకున్న భటులు, ఇక చాలునని ప్రభువునకు సైగచేసి వాడ్ని అవతలకు లాక్కుపోయారు. అక్బర్ నవ్వుకుంటూ ముందుకు సాగిపోయినప్పటికీ, అతడ్ని శిక్షిస్తాడేమో అని కొందరు ఊహించుకున్నారు.

పాదుషా షికారు ముగిసి తిరిగి వెళ్ళిపోయిన తర్వాత చాలా సేపటికి ఆ తాగుబోతుకి మళ్ళీ ఈలోకం స్పృహ తెల్సింది. అక్కడే ఉన్న కొందరు "ఆ మైకంలో నువ్వు ఇందాక ఎవరితో ఏం వాగావో తెల్సా?" అంటూ పూస గుచ్చినట్టు అతడి వాగుడంతట్నీ అతడికి తెలియజెప్పారు. ముక్తాయింపుగా "ఓరీ ! నీకు చేటుకాలం దాపురించింది అందుకే కన్నూ మిన్నూ గానక పాదుషా వారితోనే పరాచికాలు ఆడావు. పైగా ఏనుగును అమ్మమన్నావు. నీకు తల తెగిపోవడం ఖాయం" అంటూ విపరీతంగా భయపెట్టేశారు.

అ వ్యక్తికూడా తనకు ఇక చావు తప్పదని, ఉరిశిక్షతో రేపీపాటికి తనపని సరిఅని గడగడలాడిపో సాగాడు. తనని రక్షించే వారే లేరా అని ఆక్రోశించాడు. వ్యసనానికి బానిసై పీకమొయ్యా తాగి ఒళ్ళు తెలీక

Brought To You By www.greenmangos.net

వాగినపుడు ఈ బుద్ధి ఏమాయె ? నంటూ చివాట్లు పెట్టేవారే తప్ప ఎవరూ తరుణోపా యాన్ని సూచించలేక పోయారు.

ఇంతలో అటుగా వెళ్తున్న ఆస్థాన పండితవర్యు డొకాయన, వాడి దుస్థితికి విచారించి " ఓయీ ! చింతించకు ! నీకిప్పుడీ కారుచీకట్లో బీర్బల్ మహాశయుడే కాంతిరేఖలా ఒక దారి చూపగలడు. ఆయనే నిస్సహాయత వ్యక్తం చేస్తే అప్పుడు విచారిద్దువు గాని ! ముందు వెళ్ళి ఆయన దర్శనం చేసుకో" అని సలహా ఇచ్చాడు.

అతడు భయంతో పరుగెత్తుకొని పోయి, బీర్బల్ నివాసం చేరుకుని మొట్టమొదట చేసిన పని–ఆయన కాళ్ళకు అడ్డంపడి సాష్టాంగ నమస్కారం చెయ్యడం. " స్వామీ ! మీరే నన్ను రక్షించాలి ! అక్బర్‌కు అత్యంత ఆప్తులైన మీరు చెప్తేతప్ప నాకు ఇక బతికే అవకాశం లేదు. శరణు మీరు నాకు అభయం ఇచ్చేదాకా, మీకాళ్ళు వదిలే ప్రశక్తి లేదు " అని అక్కడనుంచి లేవకుండానే తాను తాగి ఏం వాగిందీ దాచకుండానే అంతా చెప్పేశాడు.

బీర్బల్ కూడా ఆవ్యక్తిని రక్షించదలచి శరణు ప్రసాదించాడు. అతడ్ని ఓదార్చి పంపించాడు. ఆ రాత్రంతా ఆ వ్యక్తిని ఎలా కాపాడాలా అని ఆలోచించాడు. తెల్లవారి లేస్తూనే మళ్ళీ ఆవ్యక్తే బీర్బల్‌ని దర్శించాడు.

బీర్బల్ ఆ వ్యక్తితో ఇలా చెప్పాడు... " ఓరీ ! నీవు నేను దర్బారులో ఉండగా రా! అప్పటికే ప్రభువుకు నేను చెప్పవలసినదంతా చెబుతాను. ఆయన అడిగే ప్రశ్నకు ' నేను దళారీని నాదేముంది ? ఏనుగు బేరగాడు జారిపోయాడు ' అనే జవాబు మాత్రమే రావాలి! మిగిలినదంతా నేను చూసుకుంటాను తెల్సిందా !" అని ఉద్బోధించాడు.

అక్షరం పొల్లుపోకుండా అలాగే చెప్తానని ఆవ్యక్తి తిన్నగా రాజదర్బారు వైపు నడక సాగించాడు.



బీర్బల్ గుర్రం మీద అక్బర్ ఆస్థానానికి చేరుకున్న కొంతసేపటికి, ఆవ్యక్తి నిండుకొలువులో ప్రవేశించాడు. లోపలికి వస్తూనే, బీర్బల్ మహాశయుని ఉనికి ధృవపరుచుకొని ఆ తాగుబోతు సరాసరి అక్బర్‌కు ఎదుట నిలిచి సలాం చేశాడు.

ఆ వ్యక్తిని గుర్తించిన అక్బర్ అగ్రహోదగ్రుడై " ఏమిరా ఏనుగు కొనే మొనగాడివి నువ్వేకదూ ! ఏదీ సొమ్ము తెచ్చావా ?" అని అడిగాడు.

కాళ్ళు వణుకుతున్నా, మాట తడడబడనీయకుండా బీర్బల్ ఉన్నాడన్న ధైర్యంతో ఆ వ్యక్తి "ప్రభువులు క్షమించాలి! అసలు ఏనుగు బేరగాడు జారిపోయినాడు. నేను దళారీనీ, మధ్యవర్తిని బేరం చేయాలంటే కొనేవాడుండాలి ప్రభూ!" అంటూ ఉండగా అక్బర్ ముసిముసిగా నవ్వు కోవడం గమనించినాడు బీర్బల్.

ఈ మాటతో ఆ తాగుబోతుమీద అక్బర్‌కుఏవిధమైన కోపం కలగలేదని గ్రహించాక "ఓరీ! మధ్యదళారీగాళ్ళతో ప్రభువులు మాట్లాడరు. నిన్ను క్షమించారులే పో! పొమ్ము" అని కసురుకొన్నట్లు నటన కోపం అభినయించాడు. అతడు వంగి సలాములు చేస్తూ వెనక్కు నడిచి జనంలో కలిసిపోవడం చూసి "ఓహో! బీర్బల్! ఇదంతా నీ చమత్కారం అన్నమాట" అంటూ తగ్గు స్వరంతో అన్నాడు అక్బర్.

## ఏ కాలం మంచిది ?

దర్బారులో అక్బర్ కొలువుతీరి ఉండగా, సకల పురజన ప్రముఖులు, సామంత, దండనాథ, పండిత వర్యులు సముచితాసనాలు అలంకరించి ఉన్నారు.

ఉన్నట్టుండి అక్బర్ సభాసదుల్ని ఉద్దేశించి " మీకు ఒక క్లిష్టమైన ప్రశ్న వేస్తున్నాను. దానికి ఎవరు జవాబు చెప్పినా అది సమర్థించు

Brought To You By www.greenmangos.net

కోడానికి కూడా వేరే ప్రయత్నించాల్సి ఉంటుంది. వారి సమాధానాలకు ఇతరుల సమర్థింపు పనికిరాదు కనుక బాగా ఆలోచించి జవాబు చెప్పవలసి ఉంటుంది " అన్నాడు.

అందరూ తలలు ఊపారు.

నిజానికి అక్బర్ వేసినది చాలా తేలికైన ప్రశ్నలా కనిపించ సాగింది అందరికీ. ఆ ప్రశ్న ఇది. "మనకి మూడు కాలాలున్నాయి కదా! వీటిలో ఏ కాలం మంచిది ?" అని... ఇద్దరు ముగ్గురు ఉత్సాహంగా జవాబులు చెప్పారు. ఒకరు వర్షాకాలం మంచిదన్నారు. పంటలు పండించే రైతులకు మేలు చేకూర్చగల వర్షాకాలం లేకపోతే బతుకు నివ్వగల మెతుకే లేదని సమర్థించుకో జూశారు. కాని అక్బర్ ఆ సమర్థింపుపై తిరిగి అనుబంధ ప్రశ్నలు సంధించే సరికి వాళ్ళకు సమర్థించుకోవడం చాలా కష్టతరమైంది. దాంతో ఇక అందరూ "అసలు ప్రభువుల వారు ఈ ప్రశ్నను బీర్బల్‌కు వేస్తే, ఆయన ఎలా సమర్థించు కుంటాడో చూడాల్సిందే " అని ఏకగ్రీవంగా జవాబుఇచ్చారు.

ఉన్న మూడు కాలాల్లో ఏదో ఒకకాలం మంచిదనక తప్పదు. ఇప్పటికే ఈ ముగ్గురూ మూడు కాలాలూ మంచివని సమర్థించలేక పోయారు. కనుక బీర్బల్ ఏం చెప్తాడోనని అంతా కుతూహలంగా వినసాగారు.

"చక్రవర్తీ ! సాగితే, జరుగుబాటు ఉంటే ఎవరికీ కాలంతో పనే ఉండదు" అన్నాడు బీర్బల్.

"అంటే...నీ ఉద్దేశం?"

"ఏముందీ? తన దగ్గరకే అన్నీ రప్పించుకోగల శ్రీమంతులని అర్థం" అన్నాడు బీర్బల్.



"అంటే... అన్నీ తన దగ్గరకే రప్పించుకోగల వారికి అన్ని కాలాలూ సమానమేనంటావా ?

"ఒక్కమాటలో చెప్పాలంటే కాలంలో తేడావచ్చినా దాన్ని దానంతో చక్కబెట్టుకో గలరని నాభావం " అన్నాడు బీర్బల్.

"మూడు కాలాలు మూడు తీరులు. అవి డబ్బుతో ఎలా చక్క బడతాయి?"

"ఏముందీ? ధనం వెచ్చించి ఆయా బాధలనుంచి రక్షణ పొందు తున్నప్పుడు, వారికి ఏ కాలమైన ఒకటేగదా ! ఏదీ వారిని బాధించదు కదా! బీదవారికే కదా కాలం భేదం వల్ల నష్టం కష్టం దాపురించేది "

" వేసవి వేడిని ధనవంతులు ఎలా ఆపుతారు?"

"వేడిని ఆపుతారని కాదు ప్రభూ! నా మనవి ఏమిటంటే దాన్నుంచి రక్షణ పొందుతారని! ఏమున్నదీ! చల్లని పానీయాలు ఆరారా త్రాగుతూ, వేడి తగలని రీతిలో చలువరాతి మేడలు కట్టుకొని నివవిస్తూ సాయంత్రం వరకు విశ్రమించి అలుపు ఎరుగని రీతిలో సాయంకాలం వేళ వ్యాహ్యాళికి వెళ్తూ తాపోపశమన మార్గాలు అవలంబిస్తున్నారు. అదే బీద వారైతే సంపాదించినది కూడు-గుడ్డకే చాలనపుడు చలువ ఇళ్ళూ చల్లని పానీయాలూ వారికి గగన కుసుమాలు కావా?"

" మరి...ఇతర కాలాల్లో ?"

" వర్షాకాలంలో వానచుక్కకు తడవని మిద్దె ఇళ్ళుంటాయి వాళ్ళకు. శీతాకాలంలో ఉన్ని వస్త్రాలు, రగ్గులు, వెచ్చని చలినెగళ్ళు, సుఖించడానికి పరివారం ఇక వారికి కష్టమేది?"

"ధనం లేకుంటే బీదవారికి కాలసంబంధ బాధలు తట్టుకోవడం అసాధ్యమా?"

Brought To You By www.greenmangos.net

"అవును ప్రభూ! వారు ఏ కాలంలోనైనా కష్టించి పని చేస్తే తప్ప ఆహారమే సమకూడదు. ఇక విలాసాలు, కులాసాలు వారికెక్కడ? అంచేత కాల సంబంధమైన బాధలు పేదవారికే! వారికి అన్ని కాలాలూ యాతనకు గురిచేసేవే" అని యుక్తియుక్తంగా సభారంజకంగా చెప్పి, ప్రభు సన్మానం పొందాడు బీర్బల్.

## బీర్బల్‌కు దేశ బహిష్కారం

కొలువుకూటంలో 'వినోద సమయం' అని ప్రతిరోజూ దాదాపు మూడు గంటల కాలం ప్రభువుల వారిని ఉల్లాసంగా ఉంచేందుకు నిర్దేశించిన కాలం. ఆ సమయంలో సరదాలు, చమత్కార ప్రసంగాలు, హాస్య భాషణలు ఎవరైనా ఎన్నయినా చెప్పడం లేదాఆ చెయ్యడం ఆనవాయితీ. అయితే వీటిలో అక్బర్‌కు నొప్పి కలిగించని రీతిలో ఉండేవే ఆమోదించ బడతాయి. వాటికి సన్మానం ఇవ్వబడుతుంది. విమర్శ, హేళన పనికిరావు. అవి శృతి మించితే రాజదండన విధించడుతుంది.

ఒకరోజు దర్బారులో అక్బర్ కొలువుతీరి ఉండగా, ఆయనగారి జనానా నుంచి పిలుపు వచ్చింది. ఉన్నది నిండుకొలువులో అదీగాక విరామ సమయంలో ! ఒక రసవద్గోష్ఠి జరుగుతున్నందున, అది పూర్తయ్యాక వెళ్దామనుకున్నాడు. అంతలో సత్వరమే అక్బర్ రాక అనివార్యం అని ఖబర్ అందింది ఇంకొకసారి. జనానాలోకి మారాక ఏమి అంత జరూర్? క్యాహై అక్కడ పీన్గెళ్ళిందా ఏమైనా ? పాగల్ " అంటూ కబురు తెచ్చినవాడిమీద గయ్యిమన్నాడు అక్బర్.

"జీ హుజూర్" అంటూ వాడు అక్కడే నిలబడ్డాడు. "ఓహో! అంటే జరగరానిదేదో జరిగిందన్నమాట! ఇక తప్పదని లేచివెళ్ళి విసవిసా నడుస్తూంటే కాలుమడతపడి జారి పడ్డాడు. ప్రభువు కాలికేదో తగిలింది కాబోలు లెమ్మని సభలోని వాళ్ళంతా విచారపడుతూ ఆయన్ను



"నెమ్మది... నెమ్మది" అంటూ ఊరడిస్తూ వుంటే 'అంత విసవిసలేల?' అన్నట్లు తిరస్కారంగా వీరబలుడు నవ్వాడు. అది అక్బర్‌కు కోపం తెప్పించింది.



జారిపడ్డ అక్బర్‌ను చూసి హేళన చేస్తున్న బీర్బల్

'ఇంతమంది నా స్థితికి నవ్వలేదు సరికదా !... పైగా నా కాలికేదో తగిలిందన్నట్లు విచార పడుతుంటే, అంతరంగిక మిత్రుడవై ఉండికూడా నిండు సభలో నా పరువు తీసేలా నవ్వుతావా !ఉండు నీ పనిచెబుతా' నన్నట్లుగా అక్బర్ ఒక్కక్షణం ఆగిపోయి అప్పటికప్పుడు అక్కడికక్కడే ఒక హుకుమ్ జారీ చేశాడు.

"ఇంత కొలువులో వీరబలుడొక్కడే మాపట్ల అగౌరవంగా ప్రవర్తించి అమర్యాదకరంగా నవ్వినాడు. అది యుక్తమైనట్టిదా ?

కాదుగనుక అది మేము పరాభవంగా భావించుటచేత నేటినుంచి అతడికి దేశ బహిష్కరణ శిక్ష విధిస్తున్నాం ! అతడీ రాజశాసనం ప్రకారం

Brought To You By www.greenmangos.net



నాదేశం వదలి వెళ్ళాలి. ఇక నా భూమ్మీద అతడు అడుగు పెట్టరాదు" అంటూ వీరబలుని ముఖమైనా చూడకుండా చరచరా వెళ్ళిపోయాడు.

ఈ శాసనం ఎలాంటి విపరిణామాలు కలిగిస్తుందోనని అందరూ ఆందోళన పడ్డారు. దానిక్కారణం అందరికీ తెలుసు! మైత్రిచేత అక్బర్‌ను చూడక బీర్బల్ వుండలేడు. ఇక వీరబలుడు లేక అక్బర్‌కు తోచదు. శాసనం అతిక్రమిస్తే మరణదండనే!.....

అందరికీ లోలోన భయం-భయంగానే ఉన్నా ఎవ్వరూ ‘ ఇది ప్రభువులకు తగదు’ అని చెప్పలేక పోయారు. వీరబలుని చమత్కారాలు లేకపోవడం, అతడి వియోగం వారికీ బాధాకరమే ! కానీ, ఏనుగు చతికిలబడితే ఏనుగులే లేవదియ్యగలవు గాని పీనుగుల సహాయం సరిపోగలదా ?

అక్బర్ శాసనానికి ఎదురు చెప్పక అదురు-బెదురు లేకుండా బీర్బల్ రాజదర్బార్ వదిలి వెళ్ళిపోయాడు. కనీసం జరిగింది పొరపాటని, క్షమించమని కోరినా సరిపోయేదని కొందరు వ్యాఖ్యానించారు. ‘ అది అతడి జాతకంలో లేదు. అదీగాక అతడేమీ తప్పు చెయ్యలేదు. మనం మెహర్బానీకి అక్బర్‌ని ఊరడించాము గానీ, లేనిపోని భేషజాలకు అస్సలు తావివ్వని బీర్బల్‌కి అలా ప్రవర్తించాల్సిన ఖర్మమేం వచ్చింది ?’ అంటూ గుసగుసలాడుకున్నారు.

ఆ మర్నాటి నుంచీ బీర్బల్ లేని దర్బార్ నడుస్తోంది. కాని చమత్కారాలు లేక రసహీనంగా ఉండేది. క్రమంగా సభ్యుల సంఖ్యకూడా పల్చబడసాగింది. ఇప్పుడా అక్బర్‌ని నవ్వించగల విదూషక పాత్ర భారం మంత్రిమీద పడింది. అతడు సహజంగా పండితుడు కాడు గనక, కొన్ని చర్యలు విదూషక పరిధి దాటి దూషక స్థాయికి పోసాగాయి. అది సభికులకు వెగటుపుట్టిస్తున్నదే తప్ప వినోదం కలిగించడం లేదు.



దర్బారు ప్రజాభిప్రాయంతో పాటు, అక్బర్‌కు కూడా ఇదే అభిప్రాయం వారం తిరక్కుండానే కలిగిపోయింది. బీర్బల్ కోసం రహస్యంగా వెతికించసాగాడు. దగ్గరగా ఉన్నప్పుడు తెలీని విలువ, ఆ వ్యక్తి పరోక్షంలో తెలిసొచ్చింది అక్బర్‌కి. వియోగం అందునా తనకానందం కలిగించే మిత్రవియోగం అతడు అనుక్షణం అనుభవిస్తున్నాడిప్పుడు.

ఇలా ఉండగా-పాదుషా ఒకరోజు కోట పైభాగాన బురుజుల వద్ద షికారు చేస్తుండగా ఒక ఒంటెద్దు బండి వాహనం తెరలు కట్టబడి సాగిపోతుందా రాచవీధిలోంచి. మొదట అదొక జనానా బండి కాబోలు ననుకున్నాడు గాని, తెరలు కట్టబడిన వైనం చూస్తే అది అంతఃపురానికి చెందిన బండిలా కనిపించలేదు. చుట్టూ కాషాయ రంగు తెరలు బండిమీద ఒక జెండా, జెండాపై కపిరాజు పరిశీలించి చూసి, అది బీర్బల్ మహా సయుడిదేనని నిర్ధారించుకున్నాడు అక్బర్.

వెంటనే ఒక్క చేసైగతో బండిని ఆపుజేయించాడు. అడుగులు తడబడుతుండగా తానే స్వయంగా బండి దగ్గరకెళ్ళి తెరలు తొలగించి చూశాడు. బండిలోని కూర్చున్న బీర్బల్‌ని గుర్తించాడు. ఒక్కక్షణం అతడి హృదయం ఆనంద తరంగితమైంది. అంతలోనే నటనకోపం అభినయించి "ఏం బీర్బల్! తిక్క తిక్కగా ఉందా? రాజ ధిక్కారమా? నా రాజ్యంలో కాలుమోపినట్లయితే దేశ బహిష్కృతులకి విధించే శిక్ష మరణ దండనమే నని నీకు తెలీదా? తెలిసే ఇంతకు తెగించావంటే నీ తల కాచుకోగలననే అనుకుంటున్నావా?" అంటూ బుకాయించ బోయాడు.

బీర్బల్ గడ్డం పెరిగినందున దాన్ని సవరదీసుకుంటూ "జహాపనా! ఈ బండిలో ఒక మట్టిగుట్ట ఉంది కనిపిస్తోంది కదా ! ఇది మీ రాజ్యంలోని మట్టికాదు. కావాలంటే భూస్వభావ పరిశీలకుల చేత పరీక్ష

Brought To You By www.greenmangos.net

చేయించుకోవచ్చు! మీ ఆజ్ఞ నేనెక్కడ మీరాను? ఇదుగో! నేను కూర్చున్నది కూడా పర రాజ్యపు మట్టే " అంటూ పిడికెడు మన్ను తీసి అక్బర్ చేతిలో పోశాడు తొట్రుపడకుండా.

నవ్వు తెప్పించే బీర్బల్ చర్యలు లేక ఇన్నాళ్ళూ తానెంత కోల్పో యిందీ, ఈ ఒక్క చర్యతో అర్ధమైన అక్బర్ రెండు చేతులూ దులుపుకొని, స్వయంగా తన చెయ్యి అందించి బీర్బల్‌ను బండిలో నుంచి దింపుతూ " చాలించు మిత్రమా నీ పరిహాసం! ఇన్నాళ్ళూ నువ్వు లేకుండా ఎలా గడిపానా అని నాకిప్పుడు ఆశ్చర్యంగా ఉంది! నిన్ను యధేచ్ఛగా ఈ మట్టి మీద సంచరించడానికి స్వయంగా ఆహ్వానిస్తున్నాను " అన్నాడు అక్బర్.

" ఏమో అక్బర్ ! పాదుషావారు తమరు. తమతో వైరం కొనితెచ్చుకోవాలని మాకు మాత్రం ఏమాన్నా సరదానా ? అదీగాక తమకు వ్యతిరేకించి మేము జీవించగలమా ? ఏదో.... ఇలా పరరాజ్యం మట్టి మీదనే మా బ్రతుకు తెల్లారిపోనీయండి " అంటూ మరింత ఉడికించాడు బీర్బల్.

దానికి జవాబుగా అక్బర్ "బీర్బలా! నీ వియోగవశాన' నీ గొప్పదనం మాకు ఇంకా బాగా అవగతం అయ్యిందయ్యా ! జరిగిందానికి నేను విచారిస్తున్నాను. ఇకనైనా ఈ మిత్రుడిని కటాక్షించి, మరింక మారాం చేయక ఎప్పటిలాగే దర్బారును పావనం చేస్తుండవయ్యా !" అని రెండు చేతులూ పట్టుకుని బ్రతిమాలి బీర్బల్ చిరునవ్వులు చిందిస్తుండగా, కొంత కుదుట బడ్డాడు అక్బర్.

## మేలు మరచే దెవరు ? మరవని దెవరు ?

నిండు కొలువుకూటాన అక్బర్ కూర్చుండి, సభికులవంక సాభిప్రాయంగా చూసి ఒక రోజున ఈ ప్రశ్నవేశాడు.



" చేసినమేలు మరిచేవాడు ఎవరు? మరవని వారుంటే ఎవరు వారు?" ఇదీ ఆప్రశ్న. దీనికి ఎవరికీ జవాబు తోచలేదు. సమాధానంగా ఏదయినా చెప్తే, అందుకు దృష్టాంతం చూపాల్సివస్తే చాలామందికి ఏం చెప్పాలో తెలియక మిన్నకుండిపోయారు.

సమర్ధులు సైతం వీరబలుని చూసి కళ్ళతోనే మాట్లాడి "అయ్యా! తామే ఈ ప్రశ్నకు జవాబివ్వగల సమర్ధులు" అని పలికారు.

బీర్బల్ లేచి "చక్రవర్తీ! నేను అటువంటి జీవుల్ని చూసి ఉన్నవాడిని తమ సెలవైతే రేపటిరోజున వారిని ప్రత్యక్షంగా తమకు చూపించగల వాడను" అన్నాడు.

"అంతకంటేనా ? అచ్ఛాహై ! అలాగే కానియ్" అన్నాడు అక్బర్.

సభలో అందరూ తనవంక ఆర్తిగా చూడటంవల్ల పరువు నిలుపుకోవడానికి మర్నాటి వరకు వాయిదా కోరాడుగాని, సమాధానంగా తాను సిద్ధం చేసుకున్నదేదీ లేదు. తన బుద్ధి కుశలత మీద ఉన్న అపారమైన నమ్మకం వల్ల, అప్పటికి అక్బర్ ఊరుకున్నా రేపు తప్పకుండా ఇదే ప్రశ్నకు సమాధానం కోరితే ఏం చెప్పడమా? అని యోచిస్తూ పడుకున్నాడు. ఒక అర్ధరాత్రివేళ అతనికొక ఆలోచన వచ్చింది. ఇక అప్పుడు నిశ్చింతగా నిద్రపోయాడు.

మర్నాడు స్నాన సంధ్యాదులు పూర్తయిన అనంతరం, తన అల్లుని కూడా వెంటబెట్టుకుని, తన పెంపుడు కుక్కను కూడా తీసుకొని దర్బారు వినోద సమయానికి వెంటనే హాజరయ్యాడు. "మేలు మరచే వారిని మేలు మరవనివారిని చూపించడమంటే మాటలు కాదు! వీరబలుని బుద్ధి కుశలతకిది నిదర్శనం" అని ప్రజలు చెప్పుకుంటూ ఆనాడు సభా మంటపం కిక్కిరిసి పోయేలా జనం హాజరయ్యారు.

Brought To You By www.greenmangos.net

వీరబలుడు చక్రవర్తిని సమీపించి "మహాప్రభూ! నిన్న తమకిచ్చిన మాట ప్రకారం రెండు నిదర్శనాలతో వచ్చాను. ఇదిగో నాతో వచ్చిన ఈ కుక్కను చూడండి! ఏది పెడితే అది తింటుంది. తనకిది కావాలీ అని గోలచేయదు. ఆ పెట్టిన దానికే తృప్తిపడి, యజమానుడి పట్ల అతని కుటుంబసభ్యుల పట్ల ఎంతో విశ్వాసంగా ఉంటుంది. రాత్రి దొంగలు రాకుండా కాపలా కాస్తుంది. ఇంట్లో వాళ్ళెంత బాధించినా కొట్టినా ఇల్లు వదలదు. ఆదరించిన మేలు మరవక విశ్వాసం చూపే ప్రాణి ఇదేనని నా అభిప్రాయము. కృతజ్ఞతకు ఇంతకంటె దృష్టాంతం అక్కర్లేదని తమకు మనవి చేస్తున్నాను" అని చెప్పగానే నిజమేనన్నట్లు తలాడించాడు అక్బర్.

"అయింది గదా! ఇక మేలు మరచిన వారిని తమకు చూపిస్తున్నాను. ఇదిగో! ఇతడు నా అల్లుడు. నా కూతుర్ని ఇచ్చిననాటి నుంచి అతడెన్నడు మా ఇంటికి దయచేసినా ఉత్తచేతులతో నేను పంపిందిలేదు. ఎంతగా గౌరవ మర్యాదలు ఇచ్చినప్పటికీ ఏదో లోటుపాట్లు జరిగాయంటూ సణుగుతాడు. పైగా నాయందు ద్వేషం ప్రకటిస్తాడు. నా కూతురితో "మీ తండ్రికి అల్లుని గౌరవించే మర్యాద మన్ననలు తెలీవు' అని ఈసడిస్తాడు. ఇది లోకంలోని అందరు అల్లుళ్ళకూ సర్వసామాన్య లక్షణం కనుక, తమరడిగిన దృష్టాంతంకోసం ఇతరులను దూషించినట్లవుతుందని, దీని తదుపరి పరిణామాలు తెల్సినప్పటికీ మా అల్లునే తీసుకొచ్చాను" అని బీర్బల్ చెప్పగానే " శభాష్! చాలా సాహసం చేశావయ్యా ! నిజమే ! లోకంలో అల్లుళ్ళంత కృతఘ్నులింక ఉండరు. ప్రతి అల్లుడూ ఒకనాటికి మామ అయితేనే తప్ప ఆబాధ తెలిసిరాదు. చాలా చక్కగా చెప్పావు" అని భూరి బహుమతులిచ్చి బీర్బల్‌ను సమ్మానించాడు అక్బర్.

సభ్యులంతా హర్షధ్వానాలు చేశారు. బీర్బల్ కుశలతకు.



# దుక్కిటెద్దు ఫిర్యాదు

అక్బర్ చాలా దయాశీలి అని పేరుగాంచాడు. బీద సాదలకు కూడా న్యాయపరిపాలన అందుబాటులో ఉండాలని యోచించినవాడు తాను ఎక్కడో అంతఃపురంలో ఉంటే నిజంగా సత్వర న్యాయం కావాల్సిన వారికి తాను అందుబాటులో ఉండని పరిస్థితి ఎదురవు తున్నదని గుర్తించి, కోటలోపల ఒక గంట కట్టించి, దాన్ని మోగించడా నికి ఒక పొడవాటి మోకు (త్రాటిని) కోటకీవల అందరికీ అందు బాటులో ఉండేలా ఏర్పాటు చేయించాడు.

దీనివల్ల బీద-గొప్ప అనే భేదం లేక సాక్షాత్తు చక్రవర్తి అందుబాటులో ఉండటం ప్రజలందరికీ నచ్చింది. అందరూ అది ఒక విశేషంగా చెప్పుకుని ఆనందించ సాగారు.

ఇలా ఉండగా ఒకరోజు కోటలో గంట మోగింది... గంట శబ్దం వింటూనే అక్బర్ విశ్రమిస్తున్న వాడల్లా లేచివచ్చి భటుల్ని పంపి, గంటమోగించిన దెవరో తెలుసుకొమ్మన్నాడు. వారు వెళ్ళి చూడగా మనుషులు ఎవరూ కనబడలేదు. ఒక ఎద్దు, మాత్రం అక్కడ ఉంది. ఎద్దు గంట మోగిస్తుందా అని సందేహం వచ్చి అదే సంగతి అక్బర్‌కు మనవి చేస్తే "ఏం...ఎందుక్కాకూడదు? నా హయాంలో ప్రతి ప్రాణికీ న్యాయం లభించిందన్న కీర్తి నాకు దక్కాలి. అదే గంట మోగించి నట్లయితే ఎద్దును తీసుకురండి!" అని హుకుం జారీచేశాడు అక్బర్.

ఎద్దులోపలికి ప్రవేశపెట్ట బడింది. కాని అది చేసే సైగలను అర్థం చేసుకోవడం ఎవరి వల్లా కాలేదు. ఇక బీర్బల్‌కు మాత్రమే దాని పరిభాష తెల్సునని-అందరూ ఏకగ్రీవంగా అంగీకరించగా వెంటనే బీర్బల్‌కు కబురు వెళ్ళింది. ఈలోగా ఈ వింత వార్త నగరమంతా ప్రాకి "ఎద్దు

Brought To You By www.greenmangos.net

న్యాయం కోరిందట! ఏం జరుగుతుందో చూద్దాం!" అంటూ అందరూ అక్కడకు తండోపతండాలుగా విచ్చేశారు.

దాని సైగలు గమనించిన బీర్బల్ ' ఓహో! ఇదా సంగతి ' అని చిర్నవ్వు నవ్వి "పాదుషా ! ఇది బాగా బలిష్ఠంగా ఉన్నరోజుల్లో దీని యజమాని దీనికి సరైన మేత కూడా వెయ్యకపోయినప్పటికీ అమితంగా శ్రమించి అతనికి సేవ చేసింది. ఇప్పుడిక వయసుడిగిన స్థితిలో దీన్ని నిర్దాక్షిణ్యంగా ఆ గుప్పెడు గడ్డీ పెట్టక వీధిలోకి తరిమేశాడని ఫిర్యాదు చేస్తున్నది" అని వివరించేసరికి అక్బర్ కోపోద్రిక్తుడై తక్షణం దాని యజమానిని తీసుకురమ్మని భటుల్ని ఆదేశించాడు.

వెంటనే భటులొక తాటాకుల కమ్మవానిని తెచ్చి, అక్బర్ ఎదుట నిలబెట్టినారు. ఎద్దు ఫిర్యాదు నిజమేనా? అని గద్దించాడు అక్బర్. "నిజమే ప్రభూ! దీనికి బలం ఉన్నరోజుల్లో పొలం దున్నే పనే గాక వేసవిలో తాటాకుకమ్మ కొట్టి బండ్లకెత్తించి దీనిచేత లాగించాను. కాని నాకు ఉపయోగపడనపుడు దీన్ని మేపడానికి నేనేం పిచ్చివాడినా?" అని ఎదురు ప్రశ్న వేశాడు.

" ఛుప్ ! కృతఘ్నుడా ! నీవరస చూస్తుంటే, మేపడం భారమని ముసలి తల్లిదండ్రుల్నీ వీధి పాల్జేసే వాడిలాగా కనిపిస్తున్నావు. కొన్నేళ్ళకు నీకు మాత్రం ముసలితనం రాదా? అనాడు ఈ ఎద్దుశాపం నిన్ను బాధించక ముందే మేలుకో! వ్యాజ్యం వేసిన ఈ ఎద్దు పక్షాన తీర్పు చెప్తున్నా ! విను ! అపరాధ రుసుముగా ఖజానాకి వెయ్యి దీనారాలు జమ చేస్తావో లేక గోరక్షణశాల కట్టి ఇటువంటి ఎద్దుల్ని గాని ముసలి ఆవుల్నిగాని మేపుతావో నువ్వే తేల్చుకో !" అని నిర్ణయం అతడికే వదలివేశాడు అక్బర్.



చక్రవర్తి ఆజ్ఞ పాలించకపోతే తన తల కోటగుమ్మానికి వేలాడుతుందన్న భయం చేత-శిక్షలు కఠినంగా ఉండడంచేత గోరక్షణకే సిద్ధపడ్డాడా తాటాకు కమ్మవాడు. నిష్పాక్షిక తీర్పునిచ్చాడని అక్బర్‌కు హర్షామోదాలు ప్రజలు పెద్దపెట్టున తెలిపారు.

# సందేహాల పుట్ట

సందేహాలపుట్ట అయిన అక్బర్, ఒకనాడు సభలోని అందరి వంక చూచి " సభాసదులారా ! చిరకాలంగా నన్ను కొన్ని సందేహాలు ఆవరించి ఉన్నాయి. అవి తీర్చగల వారికి గొప్ప బహుమానం ఇవ్వగలను " అన్నాడు. అక్బర్‌కు నచ్చేవిధంగా జవాబులు చెప్పడం చాలాకష్టం అని తెలిసిన సభాసదులు నోరు మెదపలేదు. ఆయనతో చిరకాలంగా ఉన్న మైత్రిని పురస్కరించుకొని వీరబలుడు తాను సమాధానాలు చెప్పగల నంటూ ముందుకొచ్చేసరికి అక్బర్‌కు ముఖం వికసించింది. ఇవీ ఆ ప్రశ్నోత్తరాలు.

" మనకానందానిచ్చేదేది ?"

" మనస్సు ఇచ్చినట్లు ఇతరమైన వేవీ ఆనందాన్నీయలేవు "

" ఏ ఫలములు మనుషుల కానందాన్నిస్తాయి ?"

" కడుపు పండిన ఫలమే చిరకాలం ఆనందాన్నిస్తుంది "

" గోడకు వెల్ల వేయడంలో అంతర్యం ఏమిటి ?"

" ఇంటి శుభ్రత మన మనస్సులోనూ ఉన్నదని తెలియ జేయడమే అసలయిన అంతరార్థం "

" లోకంలో దేనిపట్ల మనుషులకు తీపి ఎక్కువ ?"

" ప్రాణం కంటే తీపి అయిన వస్తువు ఇంకొకటి లేదు"

" ఎవరైనా ఎవరికి లొంగి ఉంటారు ?"

Brought To You By www.greenmangos.net



అక్బర్ ప్రశ్నలకు బదులిస్తున్న బీర్బల్

" ఎవరైనా తమకు అత్యంత ప్రియమైన వారికి ఏదో సందర్భంలో తప్పక లొంగుతారు"

" రాజుకు, సన్యాసికి భేదం ప్రధానంగా ఎక్కడుంది ?"

" కేవలం కోరికలో మాత్రమే రాజుకి అన్నిటి మీదా కాంక్ష అధికమవుతుంది. సన్యాసికి అది పూర్తిగా వ్యతిరేకం.

" దేనిమీద నిలబడిన వాడు గొప్పవాడు ?

"నీతి మీద నిల్చినవాడే ఉన్నతుడు. ఇతరులకు అతడిఎత్తు అందుకోగల సామర్థ్యం రాదు.

"స్త్రీకి ఏది అందం? దేహమా? మనస్సా?"

"రెండూ కాదు. హిందూ స్త్రీకి మాత్రమే అయితే చెప్పగలను. భారత నారికి శీలమే అందం"



"నిజమైన ప్రభువు ఎవరు?"

"నిర్విచారంగా ఉండగల కష్టజీవి"

"రాజుకు ప్రభువు అనే నామాంతరం దేనికి? అది భగవంతునికి వర్తించేది కదా!"

"నిజమే ! గొప్పరాజు గొప్ప పరిపాలకుడిగా కూడా ఉంటాడు. కాని అందర్నీ ఒకే గాట కట్టి ప్రభువు అనడం నిజంగా మొహ మాటానికే. అది తప్పు ఏదీ కాదు"

"భార్యకు విధేయులుగా కొందరెందుకుంటారు?"

"నిజమైన సహధర్మచారిణిని పతివ్రత అంటారు కదా ! భర్తకు అనుకూలవతి అయిన ఇల్లాలి సుగుణ సంపదను ఎరిగిన వారు అట్లా ఉండడంలో ఆశ్చర్యం లేదు.

"యోగం ఎవరికి కలుగుతుంది?

"కాలంతెచ్చే మార్పు ఎవరికి అనుకూలిస్తే వారికే 'యోగం' అనేమాట వర్తిస్తుంది.

"మరణానంతరం మనం ఎటు పోతామని నీ భావం?"

"మనం అంటే ఈ లోకానికి సంబంధించినంత వరకు ఎవరి దేహం వారిదే! శిధిలమైపోయే ఈ దేహంలోంచి సూక్ష్మ శరీరం (ఆత్మ) పరమాత్మని చేరుకునే చోట 'మన' అనే భావమే ఉండదు.

"లోకంలో ఎవరు పూజింపబడతారు?"

"ఇతరుల గొడవల్లో తలదూర్చనివారు, తమను 'పెద్ద'గా అంగీకరించినపుడు మాత్రమే హితవు చెప్పేవారు, ఏ మాత్రమూ తమకు సంబంధించని ప్రపంచ వ్యాపారాలకు దూరంగా ఉండేవారు పూజనీయులు. ఈ లక్షణాలు వేర్వేరుగా కాక, ఒక్కరిలోనే ఉండడం సంభవమైతే, అట్టివారు మరీ మిక్కిలి వందనీయులు అవుతారు.

Brought To You By www.greenmangos.net

"ప్రజలెవరు? రాజెవరు?"

"మొదటి వారు భారం ఉంచేవారు, రెండోవారు భారాన్ని మోసేవారు"

"నీకూ-నాకూ భేదం ఏమిటి?"

"ఇంతకు ముందు చెప్పినట్లుగానే ఆకారంలో తేడాఉండక పోవచ్చు! ఇద్దరం ఒకే లోకం నుంచి ఊడిపడివున్నవాళ్ళం. అయితే మీరు మీతో ధనబలం, భుజబలం తెచ్చుకున్నారు. నేను హడావుడిలో ఆ రెండూ వదిలేసి నా చేతికి అందిన బుద్ధిబలం ఒక్కటే పుచ్చుకు చక్కా వచ్చాను"

"ఏమి ఈ ధిక్కారం? అంటే మాకు అది లేదనా నీ ఉద్దేశం?" అక్బర్ ఆగ్రహించబోయాడు.

"ఇదే రాజులకున్న అహం! సమాధానం జాగ్రత్తగా వింటే మీకీ ప్రశ్న ఉదయించదు. ఇద్దరం వచ్చినది ఒకలోకం నుంచే... అని కదా చెప్పాను. కాని ఇద్దరికీ ధన/భుజ బలాలు ఎందుకు రాలేదో తమరే సెలవివ్వండి".

"అచ్చా భాయ్! నా కళ్ళు తెరిపించావ్ కనుక నిన్నూ ధనవంతుడ్ని చేస్తా" అని అప్పటికప్పుడే బీర్బల్‌కి భూరి బహుమానాన్ని ప్రకటించాడు.

## యుక్తి యుక్త సమాధానం

సర్వసాధారణంగా రాజ దర్బారులో పండితులైన వారికి ఏ రోజుకా రోజు ప్రాణగండమే! ప్రభువుకేదో శంక బయల్దేరును. అది పండితుల వారే తీర్చవలయును. అందునా ప్రభువుకు నచ్చేరీతి సమాధానం అయి ఉండవలయును. ఇది సమయస్ఫూర్తి గలవారికే సాధ్యం కాని అన్యులకు అసాధ్యమే! అక్బర్‌లాంటి పరాయి గడ్డ ప్రభువుల పరిపాలనలో ఉన్నవేళ స్థానిక పండితులకు దినదినము ప్రాణగండం ఉండడంలో వింత లేదు కదా!



బుద్ధిబలం దైవదత్తమైన శక్తి అయినప్పటికీ సమయానికి స్ఫురించకుంటే అది నిష్ఫలమే అవుతుంది. ఒకసారి వీరబలునికీ ఇటువంటి చిక్కు ఎదురైంది.

అక్బర్ ఏదో అతితెలివి ప్రశ్న అడిగాడు. ఎంతో ఓర్పుగల బీర్బల్ దానికి ఉచిత రీతిన జవాబూ చెప్పాడు. కాని అది అక్బర్‌కు రుచించక, "పండితుడవైనందున నిన్ను శిరచ్ఛేదనం చేయక విడిచి పెడుతున్నాను. నా రాజ్యం వదలిపెట్టి వెళ్ళిపో ! నీకిదే దేశ బహిష్కార శిక్ష" అన్నాడు.

వీరబలునికి మాత్రం రోషం తక్కువా? ఆ రోజే రాజ్యం విడిచి వెళ్ళిపోయాడు. అక్బర్ లేకపోయినా వీరబలుడు బ్రతకగలడు-కాని వీరబలుని వియోగం భరిస్తూ అక్బరే బతకలేడు. అందుకు గల ఏకైక కారణం... చమత్కార భాషణ యుక్తియుక్తంగా అందరూ శభాష్ అనేలా బీర్బల్ చెప్పే జవాబులు.

కొన్నాళ్ళకు అక్బర్‌కు ఆగ్రహం సడలింది. బీర్బల్ లేని దర్బార్ నిస్సారంగా ఉన్నట్లు తోచింది. తాను రాజ్యం వదలి పొమ్మన్నందున ఆ పౌరుషవంతుడు కనీసం రాజ్యం పొలిమేరల్లో ఎక్కడో సంచరిస్తూ వుండి ఉంటాడు. అతడ్ని ఎలా రప్పించడం? అందుకు-అతడు మాత్రమే స్పందించగల చమత్కారయుక్త మైన చర్యకు తావిచ్చే ప్రశ్న వేయడం ఒక్కటే అని అక్బర్ ఆలోచించాడు. తన ప్రశ్నకు ఇతరులెవరైనా స్పందించి జవాబు ఇచ్చినా అందులో పరోక్షంగా బీర్బల్ ప్రమేయం ఉండేలా చేయడానికి ఎంతో ఆలోచించిన మీదట ఒక ఉపాయం గోచరించింది.

"ఏక కాలమందుఎవరైనా సరే ఎండలోను, నీడలోను నడవ గలిగితే అట్టివారికి, వారి ఎత్తు తులదూగే సువర్ణనాణ్యాలతో, అభిషేకం జరిపిస్తాను" అని రాజ్యమంతటా చాటింపు వేయించాడు. బీర్బల్ ఉనికి తెలియడానికి అక్బర్ పన్నిన పన్నాగం ఇది అని తెలియక కొందరు "

Brought To You By www.greenmangos.net



అక్బర్‌కి పిచ్చి పట్టింది కాబోలు ! లేకున్నచో ఇది ఏమిటి ? ఎండా - నీడా ఏకకాలంలో ఈ భూమ్మిద ప్రసరింప చేయడం సూర్య భగవానుడికే తరంగాదు. ఒకవేళ మేఘాలు అడ్డువచ్చి కొంతమేర ఎండగాని, కొంతమేర నీడగాని ఏర్పడవచ్చు ! కాని అది కొంతసేపు నిలుస్తుంది. చిటికెలో నీడజారి పోతుంది. అప్పుడు ఎండ ఒక్కటే మెండుగా ఉంటుంది. కనుక ఇటువంటి అసాధ్యపు చర్యలు చెయ్యాలని చాటింపు వేయించాడూ అంటే? వెర్రి ముదిరింది అనుకోవలసిందే " అని చాటుగా చెవులు కొరుక్కోసాగారు.

బాహాటంగా అనడానికి ఆనాటి పరిస్థితులు సహకరించని దౌర్భాగ్యపు రోజులవి. ప్రజలు పేరుకు హిందువులే గాని, ఏలిక ముసల్మాను. ఎంత సహనం ఉన్నా పాముపడగ నీడన విశ్రమించిన చందమే !



ఆశ్రయం ఇచ్చి న రైతుకు మాట ఇస్తున్న బీర్బల్



చక్రవర్తికి తనపైన ఆగ్రహం సమసిపోయిందనీ ఇది తన ఉనికి కనిపెట్టడానికి అతడు ఎత్తిన ఎత్తేనని, రాజ్యశివార్లలో ఉన్న బీర్బల్‌కీ బోధపడింది. తానే మారువేషంలో వెళ్ళి ఆ విద్దూరానికి తగ్గ సమాధానం చెప్పగలడు. కాని చాలా కాలంపాటు అక్బర్‌కు దగ్గరగా మసలినందున తనమాట, నడక తీరు ప్రభువుల దగ్గర నిరంతరం ఉండే భటులు పసిగడతారు. అందువల్ల బీర్బల్ కూడా బాగా ఆలోచించి తన కనుకూలంగా ఉండే ఒక అమాయక రైతును ఎంచుకున్నాడు.

"రైతురాజా ! ఇన్నాళ్ళూ నాకు ఆశ్రయం ఇచ్చిన మీకు ఏదో మేలు చేయాలని నాకు అన్పిస్తున్నది. అక్బర్ ప్రకటన విని ఉన్నావు గదా! నీకాయోగం పట్టిస్తాను. నేను చెప్పినట్లు చేస్తావా?" అని అడిగాడు బీర్బల్.

అప్పటికి నెలరోజులుగా ఆ మహాపండితునికి ఆతిధ్యం ఇస్తూ, అతడెవరూ ఏమిటీ అడగకుండానే అన్నీ సమకూర్చుతూ 'అతిధి దేవోభవ' అని ఆదరించిన ఆ రైతు మహాశయుడు "పండితుల వారి మాట కాదంటున్నందుకు నన్ను క్షమించండి! నేలతల్లిని నమ్ముకున్న నాకు ప్రభువుల విత్తం మీద-బహుమానం మీద ఆశలేదు. అదీగాక అక్బర్ గురించి నేను విన్నది నిజమైతే, అతడొక పరాయి పాలకుడు. మన రాజుల చేతగాని తనంవల్ల ఇక్కడ తిష్ఠవేసి మన పీకలమీదకి పాలకుడిగా అవతరించినాడు. మన సొమ్ము తింటూ, పిచ్చిప్రశ్నలేవో వేసి వాటికి బహుమతిగా మన సంపదనే మనకివ్వజూపటం ఏం న్యాయమో తమరే చెప్పండి " అన్నాడు.

"నువ్వన్నది నిజంగా ఖండించరానిది. కాని కాలం-ఖర్మం తప్పించడం ఎవరితరం? మనవాళ్ళు ఐకమత్య శూన్యత మన బతుకులిలా పరాయి పాలనలో మగ్గే స్థితికి తెచ్చింది. ఇక దాని గురించి

Brought To You By www.greenmangos.net

వగచి ఏం ప్రయోజనం? ఏదోలా బతకడం తప్పనిసరి. నువ్వు అక్బర్ రాజ్యానికి వెలుపల ఉన్నావు గనుక బ్రతికిపోయావు. ఇదే అక్బర్ రాజ్యంలో ఉంటే నిన్నీపాటికి శిరచ్ఛేదనం చేసి ఉందురు. అదలా ఉంచు. బుద్ధిమంతు డైనవాడు ప్రతికూల పరిస్థితులను సైతం తనకు అనుకూలంగా మలుచుకో గలడు. నామీద నీకు నమ్మకం ఉంటే నేను చెప్పినట్లు చెయ్యి!" అన్నాడు బీర్బల్. అంతటి పండితుడ్ని చిన్నబుచ్చటం ఇష్టంలేక, సరే నన్నాడా ఆత్మాభిమాని అయిన రైతు.

"ఒక పట్టెమంచం వెడల్పు గళ్ళు వచ్చేలా నేత నేసిందాన్ని పుచ్చుకొని, నీవు అక్బర్ ఆస్థానంలో ప్రవేశించాలి. రాజభటులు నిన్ను గ్రామీణుడని ముందు అడ్డుకోబోతారు. భీతి చెందకు. పాదుషా వేయించిన చాటింపునకు ప్రతిస్పందన ఇది అని చెప్పు! వాళ్ళు వెంటనే నిన్ను నిండు దర్బారులో ప్రవేశపెడతారు. 'రాజా! మీకు ప్రకటించిన



సమయస్ఫూర్తిగా సమాధానమిస్తున్న రైతు



బహుమతి నాకు ఇప్పించండి' అని అడుగు. ఆయన వింత పడి, 'ఎండలో-నీడలో ఎలా ప్రయాణాన్ని ఏకకాలాన చేసి వచ్చావు?' అని అడుగుతారు. అప్పుడు కన్నాలు ఏటవాలుగా కన్పించేలా పట్టెమంచం ఆయనవైపు త్రిప్పి 'చూశారా! ఈ సందుల్లోంచి ఎండ వస్తుంది కదా!' అను! ఆయన తల ఊచుతాడు. అప్పుడు అదే పట్టిమంచం మరోవైపు ఏటవాలుగా తిప్పు! 'దీనికి ఇప్పుడు నీడ ఉంది కదా!' అను. ఔనంటాడు. 'ఎండలో దీన్ని అడ్డం పెట్టుకుని ఏకకాలంలో నీడనీ- ఎండనీ మార్చి మార్చి మీ దగ్గరకొచ్చాను' అని చెప్పు! పాదుషా 'శెహభాష్' అని మెచ్చుకుని, తన ప్రకటన ప్రకారం సువర్ణాభిషేకం చేస్తారు."…. అని చెప్పాడు బీర్బల్.

"వినడానికి ఇదంతా బాగానే ఉంది గాని, ఏమన్నా తేడా వస్తేనో" అన్నాడా అమాయకపురైతు.

"నేను అదే చెప్పబోతూన్నాను. నీకు తప్పక సువర్ణ సన్మానం జరుగుతుంది. సందేహం లేదు. కాని కథ అక్కడితో పూర్తయిపోలేదు. పాదుషా నిన్ను ప్రత్యేకంగా పిల్చి 'మెతుకు పెట్టి బతుకునిల్పే రైతు మహాశయా! ఈ ఉపాయం నీకు ఎవరు చెప్పినదీ నాకు చెప్పవలసినది అని సౌమ్యం గానే అడుగుతారు. అప్పుడు సౌమ్యంగానే నువ్వుకూడా 'మహాప్రభూ ! అక్బర్ రాజ్యం నుండి ఆయన దౌర్భాగ్యంకొద్దీ వెడలగొట్ట బడిన బీర్బల్ పండితుడు గత నెలరోజులుగా మా గ్రామమందు మకాంవేసి ఉన్నారు. ఆయనదే ఈ సలహా ' అని చెప్పు ! దాంతో అక్బర్ మరింత ప్రసన్నుడవుతాడు " అని బీర్బల్ చెప్పేసరికి అమాంతం ఆ రైతు ఆయన కాళ్ళపై సాష్టాంగ పడిపోయాడు.

"పండితోత్తమా ! తమరే బీర్బల్ అని మాకెవరికీ తెలీదు. ఎంత రహస్యంగా ఇక్కడ నివసిస్తున్నారో కదా ! తమ ప్రజ్ఞ కర్ణాకర్ణిగా అక్బర్

Brought To You By www.greenmangos.net

రాజ్యం సరిహద్దులు దాటి ఇక్కడ కూడా వ్యాపించింది. మా అదృష్టవశాన మిమ్మల్ని చూసే భాగ్యం మాక్కలిగింది" అంటూ ఆ రైతు ఉప్పొంగి పోయాడు. పరుగున వెళ్ళి తమవాళ్ళందరికీ 'ఆ మహావర్చస్వి మన గ్రామపు అతిథి ఎవరోకాదు. సాక్షాత్తు బీర్బల్ పండితుడని ఉత్సాహంతో చాటింపువేసి ఏలోటు కలగకుండా తాను రాజధాని నుంచి తిరిగొచ్చేవరకు చూసుకోవలసిందని జాగ్రత్తలు చెప్పి అక్షరాక్షరం బీర్బల్ చెప్పినట్లే చేయడానికి ఆ క్షణమే ఢిల్లీ నగరానికి బయల్దేరాడు.

రెండు రోజుల అనంతరం అతడు రాజధానిలో అక్బర్ కోట వద్దకు చేరుకున్నాడు. బీర్బల్ చెప్పినట్లుగానే అతడు ' పాదుషాగారి చాటింపుకు ప్రతిస్పందన ఇది ' అన్నాడు. భటులు ఆ రైతు రాజును అక్బర్ ఎదుట ప్రవేశపెట్టారు.

నెత్తిమీద మంచంతో వచ్చిన ఆ రైతును చూసి సభాసదులు ఎంతో వింతగా చూడసాగారు. 'ఎండలో - నీడలో ఏకకాలంలో ఎలా ప్రయాణించి వచ్చావు?' అడిగాడు అక్బర్. మంచానికున్న గళ్ళు (కన్నాలు) కన్పించేలా ఒకసారి కన్పించనివ్వక ఒకసారి ఏటవాలుగా పట్టుకుని, తన తలకు అడ్డుగా పెట్టుకొని దర్బారులో అందరి ఎదుటా 'ఈవిధంగా ఎండా - నీడల్లో ఏకకాలన నడిచొచ్చాను' అని ప్రదర్శించాడు రైతు.

'అమాయకుడైన రైతులా వున్నాడు. తప్పకుండా ఇది బీర్బల్ పండితుని ప్రతిస్పందనే అయి ఉంటుంది ' అని గ్రహించుకున్నాడు అక్బర్. సన్మానం ఏర్పాటు చేసిన అనంతరం నిండు సభలో ఆ రైతును ప్రశ్నించాడు. అప్పుడా రైతు "మా భాగ్యవశాన ఆ మహానుభావుడు ప్రస్తుతం మా గ్రామంలోనే మకాం వేసి ఉన్నారు. ఆయనను దూరం చేసుకున్నవారే దురదృష్టవంతులు" అని మెత్తగా చురక అంటించాడు.



అక్బర్ పశ్చాత్తాపంతో, అప్పటికప్పుడు ఆ రైతువెంట భటుల్ని పంపి, సగౌరవంగా బీర్బల్‌ను తీసుకొని రమ్మని తన ఆంతరంగిక మంత్రులలో ఒకరిని రాయబారం చెయ్యవలసిందిగా ఆజ్ఞ జారీ చేశాడు. అక్బర్ కోరికను బీర్బల్‌కు విన్నవించి, ఆ మంత్రి ప్రార్థించిన మీదట బీర్బల్, తిరిగి ఆస్థాన ప్రవేశానికి ఒప్పుకున్నాడు.

రెండురోజుల తర్వాత - సభాభవనం బీర్బల్ రాకవల్ల మళ్ళీ కళకళలాడింది. సభాసదులకు కూడా బీర్బల్ రాకతో కొత్త ఉత్సాహం వచ్చింది.

## శకునం ప్రభావం

ఒకరోజున పాదుషా అంతఃపురం నుంచి తెల్లవారుఝామునే బయలుదేరి కోట బురుజు మీదకెక్కి షికార్లు చేస్తున్నాడు. సరిగ్గా అదే సమయంలో రాచవీధిలో ఒక ముసలివాడు తిరుగాడుతున్నాడు. అక్బర్ అతడ్నే చూస్తూ నడుస్తున్నాడేమో, బురుజుపైన అలంకరణ కోసం ఉంచిన ఒకరాతి కట్టడం అతని మోచేతికి తగిలి చివ్వున రక్తం చిమ్మింది. బాధతోకూడిన కోపంతో అక్బర్‌కి ఆ క్షణాన ' ఆ ఆపద ఆ ముసలాడ్ని చూడ్డం వల్లనే సంభవించింది ' అనే నమ్మకం బలపడి పోయింది.

వెంటనే భటుల్ని పంపి ఆ వృద్ధుడ్ని కోటలోనికి రప్పించాడు. ఆ ముసలి వ్యక్తి వణికిపోతూ " పాదుషా గారి పట్ల నేనేం అపచారం చేశాను?" అనుకుంటూ కన్నీరు కార్చసాగాడు.

అతడ్ని చూస్తూనే " ఓరి ! నేనీదినము లేస్తూనే అంతఃపురంలో ఎవ్వరి ముఖము చూడక సరాసరి బురుజుపై కెక్కినాను. పైనుంచి నాకీవేళ మొట్టమొదట నీముఖమే కనిపించింది. సరిగ్గా నిన్ను చూశానో లేదో అదే సమయానికి నాకు మోచెయ్యి కొట్టుకుపోయింది. నీ ముఖాన సైతాన్ తాండవిస్తున్నాడల్లే వుంది. అంచేత నీకు మరణదండన విధించాను. ఇక పో !" అని కోపంగా అన్నాడు అక్బర్.

Brought To You By www.greenmangos.net

ఆ అనాథ వృద్ధునికి మాట మహాకలవరం కలిగించడంతో అతడు గోడు గోడున ఏడవ సాగాడు. 'ఇంతకాలం నా నుదుట నసీబు బాగుండి తినో తినకో నెట్టుకుని జీవించి వున్నాను. ఇక నాకీ భూమ్మీద నూకలు చెల్లిపోయినాయి కాబోలు' అని విచారించి ప్రయోజనం లేదని భటుల్ని బ్రతిమాలు కోసగాడు.

"ఓరీ ! మేమేం చెయ్యగలము? నీవు కంటపడిన క్షణమే ప్రభువు నకు దెబ్బ తగలనేల? నీకీరీతిన రాసిపెట్టి ఉంది. మేమిప్పుడు ఉదయపు ఫలహార వేళ అయినది. మేము ఆరగించి వచ్చేవరకు ఇక్కడ నిలబడు" అని దారిప్రక్క ఒక కట్టుకొయ్యకు సంకెళ్ళతో ఆ వృద్ధుని బంధించి భటులు ఆరగించడానికి వెళ్ళారు.

తన దుస్థితిని కన్నీరు కాల్వలై ప్రవహించేలా ఏడుస్తున్న ఆ వృద్ధుని పాలిట అమృతమూర్తిలా వీరబలుడు దారినేపోతూ కనిపించాడు.

బీర్బల్‌ని దర్శించిన ఆ ముసలి సంకెళ్ళతో సహా ఆయనకు నమస్కరించి చక్రవర్తి తనకు వేసిన మరణశిక్షకు కారణహితంగా చెప్పి మళ్ళీ భోరుమన్నాడు. అంత వయస్సులో ఆ ముసలికి వచ్చిన కష్టం విని విచారించిన బీర్బల్ అక్కడే నిలబడి ఏదైనా ఉపాయం చెయ్య గలమా? అని ఆలోచించాడు.

చివరికి అతడికొక యోచన స్ఫురించింది. వెంటనే బీర్బల్ ఆ ముసలి వ్యక్తి చెవిలో రహస్యంగా ఒక సంగతి చెప్పి, ధైర్యం వహించి ఉండమని తన దారిన తాను పోయాడు.

ముసలిని బంధించిన భటులు తీరుబాటుగా ఉదయకాల ఫలాహారాలు ముగించి రెండు ఝాముల ప్రొద్దెక్కక అక్కడకు వచ్చారు. బీర్బల్ ఇచ్చిన ధైర్యంతో ఆ వ్యక్తి వణుకు తూన్నట్లు నటించసాగాడు. అది చూసిన ఒక భటుడు "ఓరీ! నీవా చూడబోతే కాటికి కాళ్ళు చాచుకున్న



ముసలివాడవు! ఇంతవరకు ఎంతకాలం బ్రతికావో అంతకాలం ఎలాగూ బ్రతకవు. ఎందుకా తపన?" అంటూ జీవితం మీద విరక్తి కలిగిద్దామని ప్రయత్నించాడు.



ముసలివానికి సలహాలిస్తున్న బీర్బల్

దానికి వెంటనే రెండో భటుడు స్పందించి "అదేంమాట లేరా? బ్రతుకుమీద తీపి ఎవరికుండదు? శక్తి ఉడిగిపోయినా, ఇంకొంత కాలం జీవించాలని ప్రాణం తహతహ లాడుతుంది. ఇంకో నాల్రోజులు... మరో నాల్రోజులు... ఇంకొద్దికాలం జీవించడానికే ఆరాటపడటం సహజం" అని బదులు పలికాడు.

అతడిది జాలిగుండె అని గ్రహించిన ముదుసలి, వానివైపు తిరిగి "నిజం చెప్పావు నాయనా ! మరణదండన విధించారు సరే ! మృత్యువుకు పోయేముందు చివరికోరిక తీర్చడం ఆనవాయితీ కదా !" అన్నాడాతనితో.

Brought To You By www.greenmangos.net



"నిజమే ! సరే ! నీ కోరిక ఏమిటో చెప్పు !"

"మీరు నామాట విన్నాక అది నెరవేరుస్తారని నమ్మకం ఏమిటి? అంచేత నా కోరికను పాదుషా వారికే విన్నిస్తాను " అనడంతో, ముసలాడి విషయం అక్బర్‌కు మనవి చేశారు భటులు.

ఒక్కక్షణం యోచించి "నిజమే ! బలవన్మరణానికి గురిచేయ బడేవారి చివరి కోరిక ఎటువంటిదైనా తీర్చాలని ధర్మశాస్త్రం చెబుతోంది. సరే ! నీ కోరిక ఏమిటో ఈ సభాముఖంగా వెల్లడించ వచ్చు!" అని ఆమోదముద్ర వేశాడు అక్బర్.

ఆ మాటలకు ముఖం వికసించిన ముసలివాడు చేతులు జోడించి, పాదుషావారి ఆజ్ఞమేరకు సభాసదులందరికీ నా కోరికను వెల్లడిస్తున్నాను. దీనిని తీర్చవలసిన బాధ్యత కూడా వారిదేనని మనవి చేస్తున్నాను.

నేను ఈ రోజున రహదారి వెంట నిద్రించి లేచినాను. లేచీ లేవగానే ఎవరి ముఖం చూస్తే ఎటువంటి రీతిలో నాకు రోజు గడుస్తుందో నని భీతిచెంది, ఎటువైపు చూడక నేరుగా కోట బురుజువైపు చూచాను. నాకు మన పాదుషా వారి ముఖమే కన్పించింది. కనుక ఆయన ముఖం లేస్తూనే ఎవరూ చూడరాదని, అది చాలా ప్రమాదకరమని నా నిర్ణయం. కనుక ఉదయాన్నే ఎవరూ వారి ముఖం చూడకూడదని నా చివరి కోరిక. తమరు మన్నించి తక్షణం దీన్ని అమలుచేయించే చట్టం తేవాలని నా కోరికగా అడుగుతున్నాను. ఇంతకంటే నేను కోరేదేమీలేదు ". అని సభాసదుల వంక చూడసాగాడా వృద్ధుడు.

'ఇంత రాజ్యానికి పాదుషానైన నన్ను ఇందరిలో నిలబెట్టి ఇతడీ కోరికను ఇంత సాహసంగా చెప్పగలిగాడూ అంటే, ఇది వీడికి పుట్టిన బుద్ధి కాదని అక్బర్‌కు అర్థమైపోయింది. అది ఎవరి సలహా అనేది తెలుసు కోవాలని అక్బర్ ఆ వృద్ధునివైపు తిరిగి "ఓరీ! మరణశిక్ష అమలు జరిపే



ముందు నీకీ కోరిక కోరాలని ఎవరైనా చెప్పారా? చూడబోతే ఇది నీకు పుట్టిన బుద్ధి అని మాకు నమ్మకం కలుగుటలేదు. దీనికి నిన్ను ప్రోత్సహించిం దెవరో చెప్పు!" అని గద్దించి అడిగాడు.

"అయ్యా! నాకెవరున్నారని? ఇంకొకరు చెప్పడం దేనికి? వృద్ధుడను. బతికినంత కాలం బతకనుగదా!" అన్నాడా ముదుసలి.

అయినప్పటికీ పాదుషాకు అతడి మాటలు నమ్మబుద్ధి కాలేదు. "నిజం చెప్తే నీకు మరణశిక్ష రద్దు కావచ్చు! ఆలోచించుకో" అని అక్బర్ చెప్పాక అప్పుడు నోరువిప్పాడు అతడు.

"వీరబల పండితులవారు నాకీ ఉపాయం చెప్పారు. తాము నాకు శిక్షఖాయం చేయగా, నన్ను బంధించిన భటులు ఉదయపు ఫలహారం నిమిత్తం పోయినారు. అప్పుడా దారిన వెళ్తూవున్న ఆ మహానుభావుని ప్రార్థించగా, వారు నాపట్ల దయతో ఇట్లు చెప్పవలసిన దన్నారు. వారికీ నాకూ ఈరీతి సంభాషణ నడిచింది. ' ఓ ముసలివాడా! ఎవరి కర్మకు ఎవరూ కర్తలు కారు. అట్లే ఎవరి కర్మం ఏ కాలానికి ఎలా వచ్చునన్నదీ ఎవ్వరూ ఎరుగరు. వారు చేసిన కర్మ వారు అనుభవించ వలసిందే తప్ప ఇతరులు అనుభవించరు. రాజుకు దెబ్బ తగిలిందే అనుకో! అది నీ ముఖం చూడటం వల్లనే తగిలిందా ? పూర్వజన్మ కర్మఫలం వల్ల కాదా? అంతటి ప్రభువునకు ఆమాత్రం తెలీకపోయెనా? సరే! నీ ముఖం చూడటం వల్లనే తగిలిందను కుందాము.

మరి, అదే పరిస్థితి నీకూ వచ్చినది కదా? నీవు నిద్ర లేచి ఎవ్వరి ముఖం చూడక సరాసరి పాదుషా ముఖమే చూశావు కదా! పాదుషా దర్శనం వల్ల యోగం పట్టాల్సింది పోయి ఈ మరణశిక్ష యోగం ఎలా సంభవిం చింది? అందువల్లనే ఒకరి కర్మకు ఇంకొకరు కర్తలు కరనేది.

Brought To You By www.greenmangos.net

ఒకరి ముఖం ఒకరు చూసినంత మాత్రము చేతనే హాని, ప్రమాదం ముంచుకు రాదు. ఎవరి నసీబు ఎలా ఉంటే అల్లా జరుగుతుంది. నీవు శోకించవద్దు. ప్రభువుతోనే మాట్లాడతానని నీ చివరి కోరికగా నేను చెప్పినట్టు చెప్పు ! ఢిల్లీ ప్రభువులు జాలిగుండె గలవారు. నా కడసారి కోరిక తీర్చవలసిందని విన్నపం చెయ్యి ! ఆయన నీ కోరిక చెప్పమంటారు... అని ఇంతకు ముందు నేను సభాముఖంగా మిమ్మల్ని ఏది కోరానో అదే ఉపదేశించారు. వారు కూడా ఈ సభలోనే వుండి ఉండొచ్చు ! అని ముగించాడు వృద్ధుడు.

ఢిల్లీశ్వరుడు ఇది విని "గ్రహించితిమి ఈ సలహా మా బీర్బల్ తప్ప ఇంకెవరూ ఇవ్వలేరనే మా విశ్వాశం. అదే జరిగింది. నే ఆడిన మాట ప్రకారం నీకు శిక్ష రద్దు చేస్తున్నాను. నీవిక యథేచ్ఛగా పోవచ్చు!" అని భటులకు సైగచేయగా, వారావృద్ధుని బంధనాలు తొలగించారు.

బీర్బల్ సమయస్ఫూర్తి వల్ల అక్బరుకు కనువిప్పుకల్గి, నాటి నుండి బీర్బల్ ప్రభువునే నిగ్గదీయగలిగినంత సాహసుడని లోక ప్రఖ్యాతి గాంచాడు.

## కలకు ఫలితం

అక్బర్ చక్రవర్తికి ఒకరోజు రాత్రి ఎంతకూ నిద్ర పట్టలేదు. తెల్లవారురఝామున ఎప్పుడో కలతనిద్ర పట్టింది. ఆ నిద్రలో ఒక కల వచ్చింది. కలలో ఆయనకు పళ్ళన్నీ రాలిపోయినట్లు , నోరు బోసిగా వుండి నమలడానికీ, నవ్వడానికీ తాను బిడియపడుతున్నట్లుగా ద్యోతకమైంది.

మరునాడు నిండుసభలో తమ ఆస్థాన జ్యోతిష్కుడిని ఈ వింత కలకు ఫలితమెలా వుంటుందో వ్యాఖ్యానించమని కోరాడు అక్బర్.



స్వప్న శాస్త్రంలో నిష్ణాతుడైన ఆస్థాన జ్యోతిష్కుడు ప్రభూ ! ఇది చాలా చెడ్డకల. మీకళ్ళ ముందే అయినవారి మరణాన్ని మీరు చూడాల్సి వస్తుంది. ఈ కల నిర్దేశిస్తున్న ఫలితం ఇదే" అని లౌక్యం లేకుండా అన్నాడు.

తన బంధువులంతా తన కళ్ళముందే మరణిస్తారని ఆ జ్యోతిష్కుడలా చెప్పడం అక్బర్‌కు ఆగ్రహం తెప్పించింది. ఎంత శాస్త్ర విషయమైనా, ప్రభువులకు చెప్పేటప్పుడు లౌక్యం ఎరిగి మసలుకోవాలన్నది ఆ జోతిష్కునికి తెలీలేదు.

అప్పుడే బీర్బల్ సభలోకి అడుగు పెడుతున్నాడు. "హన్నన్నా! ఎంత పని జరిగింది! లౌక్యంగా చెప్పడం చేతకాక చచ్చింది గొర్రె" అన్నాడు. అతడెందుకలా అన్నాడో ఎవరికీ అర్థం కాలేదు.

అక్బర్ అది గమనించి " ఏం బీరబలా ! నీకూ స్వప్నశాస్త్రం తెలుసునా? తెలిస్తే నా కలకు ఫలితం చెప్పు " అని ఆస్థాన జ్యోతిష్కుడ్ని తాను అడిగిన ప్రశ్ననే బీర్బల్‌నీ అడిగాడు.

"ప్రభూ ! ఈ కలవల్ల మీ కుటుంబంలోని బంధువర్గంలోని అందరికంటే మీ ఆయుష్షే ఎక్కువని స్వప్నశాస్త్రం నిర్దేశిస్తుంది. తమ ఆయువు చాలా గట్టిది పాదుషా" అని అదే విషయాన్ని తిప్పిచెప్పాడు బీర్బల్.

సభ్యులు కరతాళ ధ్వనులు చేస్తుండగా బీర్బల్ పాదుషాకు సలాం చేసి తనకు కేటాయించిన స్థానంలో కూర్చున్నాడు.

అంత ప్రశంసనీయమైన విషయం చెప్పిన బీర్బల్ చతురతకు ముగ్ధుడై, అక్బర్ స్వయంగా తన సింహాసనం పైనుంచి లేచివచ్చి తన మెడలోని ముత్యాలహారం తీసి బీర్బల్ కంఠాన వేసి సత్కరించాడు. అంతటి చతురమతి బీర్బల్.

Brought To You By www.greenmangos.net

# దేవుడి పక్షపాతం !?

పాదుషాకి ఓ ర్రోజున ఓ గొప్ప సందేహం ఉదయించింది. 'భగవంతుడు దయామయుడు అని అంటారే !? ఈ సృష్టిలో కుంటి వారూ, గ్రుడ్డివారూ, చెవిటివారూ ఉన్నారెందుకు?' అని.

ఈ విషయమై సభాసదులందర్నీ ప్రశ్నించగా తలకొక రీతిగా సమాధానం చెప్పారు. కాని అవేవీ అక్బర్‌కి సంతృప్తి కలిగించనే లేదు.

అలవాటుగా అదే ప్రశ్న బీర్బల్‌ను అడిగాడు అక్బర్. "ఏమంటావు బీర్బల్? నువ్వుచెప్పు! దేవునికి ఇంత పక్షపాతమేమిటి ? దేవుడికి నిజంగా జాలే ఉంటే అందర్నీ ధనవంతులుగా సమస్త అంగాలతో పుట్టించాలిగా ! కొందర్ని పేదవారిగా మరికొందర్ని బీదవారిగా పుట్టించడమేం ?" అని.



బీర్బల్‌ను సత్కరిస్తున్న అక్బర్



దానికి బీర్బల్ జవాబు ఇదీ... " ప్రభూ ! మీరున్నారు మీ కొలువులో మేమందరం ఉద్యోగులమే ! చెప్పడానికి అందరికీ ' రాజు గారి కొలువు' అని ఒకటే మాట చెప్తాం! కాని ఇందులో ఎన్ని రకా లున్నాయో చూడండి ! మంత్రులు, సేనాధిపతులు, సామాన్య సైనికులు, ఇలా వారివారి శక్తి యుక్తుల్ని బట్టి తెలివితేటల్ని ట్టి ము ఈ ఉద్యోగు లందరికీ వేర్వేరు స్థాయాలలో జీతాలు చెల్లిస్తున్నారు. అలాగే వేర్వేరు జీవుల పుణ్య, పాప ఫలితాలను బట్టి ఆ సృష్టికర్త కూడా పాటిస్తున్నారు. కాని దేవుని చర్యను ప్రశ్నించడం దేనికి? ఆయా వ్యక్తుల యోగం మేరకు ఈ భూమ్మీద వారి కర్మ ఫలితమే వారు అనుభవిస్తు న్నారు అంతే!"

బీర్బల్ ఇచ్చిన సహేతుక సమాధానం విన్నాక అక్బర్‌కి తన పొరపాటు తెలిసొచ్చింది. తన తప్పు క్షమించమని మనసారా ఆ దేవుని వేడుకున్నాడు అక్బర్. ఆ ప్రకారంగా బీర్బల్ దేవుని పట్ల అపచారం చేస్తే ప్రభువునైనా మెత్తగా మందలించగలిగే వాడు.

# భారతం అంకితం

అక్బర్ చక్రవర్తికి ఒకానొక పండితుడు, ఏదో సందర్భంలో వచ్చిన పుడు, టూకీగా భారతం గొప్పదనం వినిపించాడు. అది హిందువులకు ధర్మసూక్ష్మాలు బోధించడంలో ఖురాన్‌కు ఏమీ తీసిపోదన్నాడు. అప్పట్నుంచీ అక్బర్‌కు ఒక కోరిక మనసులో బలంగా నాటుకుంది. అంత గొప్ప గ్రంథా నికి హిందూ పురాణ పేర్లకు బదులు తాము తమ పరివారం పేర్లు ఉండేలా చిత్రిస్తూ భారత కథ తిరగరాయ వలసిందని వీరబలుని ఆజ్ఞాపించాడు.

" మహాశయా ! భారతం రాయాలంటే చాలా పాండిత్యం కావాలి. నేనేదో తమకు వినోదం చేకూర్చగల కొద్దిపాటి పాండిత్యం ఉన్నవాడిని. అరకొరగా రాస్తే అది ఎల్లకాలం ఉండదు " అని బదు లిచ్చాడు వీరబలుడు.

" అట్లానా ! సరే ! ఎన్ని దీనార్‌లు ఖర్చయినా ఫర్వాలేదు. దేశ మంతటా గాలించి ఒకరు గాదు, ఇద్దరుగాదు.... పదిమంది పండితుల్ని వెతికి

Brought To You By www.greenmangos.net



పట్టుకోండి! అరుమాసాలు గడువు ఇస్తున్నాను. భారతం పూర్తికావాలి!" అంటూ హుకుం జారీచేశాడు.

బీర్బల్ పరిస్థితి కుడితిలో పడిన ఎలకలా తయారైంది. చూస్తూ చూస్తూ హిందూమత గ్రంథానికి మహమ్మదీయ ముసుగు తొడగలేడు. తనకు ఆశ్రయం ఇచ్చిన వారిని కాదనలేడు. అన్నిటికీ ఆ భారత రథసారథి శ్రీకృష్ణ పరమాత్ముడే ఉన్నాడని ధైర్యం చేసి అలాగే నన్నాడు.



గడువు పూర్తి కావస్తుండగా ఒకరోజు నిండు సభలో లేచి వీరబలుడు "ప్రభూ! తాము ఆదేశించినట్లు భారత రచన పూర్తి కావస్తోంది. కొన్ని సందేహాలవల్ల ఖాళీలుంచినాము. మీరే కథానాయ కులు, బేగమ్ సాహిబా ద్రౌపది. అయితే భారతంలో ద్రౌపదికి ఐదుగురు భర్తలనే సంగతి తమకు తెలియనిది కాదు. మీరుగాక బేగమ్ ఇతర భర్తలు పేర్లు ఏవో తెలి పితే ఆ ఖాళీలు పూరిస్తామంటున్నారు మా పండితులు" అని సెలవిచ్చాడు.

"అరె ! ఇదేమి భారతం వయ్యా ! మాకీ ఎంత ఇజ్జత్ ఖరాబ్! భారతం–గీరతం జాన్తా నై. మాకొద్దు " అని నిండు సభలో అక్బర్ చేతనే వద్దనిపించాడు. అలా హిందూధర్మం రక్షించాడు బీర్బల్.

★ ★ ★